శ్రీరస్తు.

# తెనాలి రామకృష్ణకవి చరిత్రము.

ఇది

ఆంధ్ర జాతీయ గ్రంథమండలివారితరఫున

మలకపల్లి పెద శేషగిరిరాయ కవిగారిచే

ప్రత్యేకముగా వ్రాయఁబడి






ఆంధ్ర జాతీయ గ్రంథమండలి వారిచే

ప్రకటింపఁబడినది.



మూఁడవ కూర్పు 3000.




కాకినాడ

ది ఆల్బర్టు పవర్ ప్రింటింగు వర్క్సునందు

ముద్రింపబడినది.

1926.



శ్రీ వేమన గ్రంథాలయము, తేలప్రోలు.


సర్వస్వామ్య సంకలితము.] [వెల రు. 1—0—0.

ఈగ్రంథముయొక్క కాపీరయిటు హక్కు, తర్జుమాహక్కులు, మొదలగు సమస్తహక్కులు, మాకు చెందియున్నవి. గాన, యెవరు గాని దీనిని రీప్రింటు చేయరాదు. తర్జుమాచేయరాదు.

***Proprietor,***

**Andhra Jateeya Grandha Mandali,**

COCANADA.

TPLD101B170

ఓం.

శ్రీమత్పరదేవతాయైనమః

# తెనాలి రామకృష్ణ కవి చరిత్రము.

శ్రీ. రమ్యంబగు పాండురంగవిజయ శ్రీ భవ్య కావ్యక్రియో
దారప్రస్ఫుట సూక్ష్మభావరచనా తంత్రజ్ఞుఁ డుత్తుంగ వి
ద్యా రమ్యప్రతిమాన హాస్యరస తత్త్వప్రాభవో పేతుఁడున్
ధీయుతుం డా కవి రామకృష్ణు కథ యుద్దీపించు నెల్లప్పుడున్.

సీ. నవ రసాలంకార నవ్య సుధామయో
క్తుల గద్యపద్యముల్ గూర్చి గూర్చి,
విద్యానగర రాజ్య విభవానుమోది శ్రీ
కృష్ణరాయల సభఁ గెరలి కెరలి,
హాస్య ప్రబంధ విహాగ యోగ్యంబులౌఁ
గవితా మృదూక్తుల గణనకెక్కి,
సక్రమాలంకార సాహితీఫణితి నే
ర్పునఁ గావ్యరత్నముల్ భువిని నిల్పి,

తే. గీ. కవికులశ్రేష్ఠుఁడంచు విఖ్యాతిఁగాంచి,
స్వర్గలోకంబుఁ జేరిన సత్కవీంద్రుఁ

డనఘుఁడు తెనాలి రామకృష్ణాభిధాన
చరిత మానంద దాయిగా వరలుఁగాత.

తెనాలి రామకృష్ణకవి శాలివాహనశకము ౧౪౨౭ నకుఁ బూర్వమే యుండి యున్నట్లు తెల్లమగుచున్నది. విద్యా రాజ్యముంబరిపాలించి యాంధ్రభోజుఁడనిప్రఖ్యాతివహించిన శ్రీకృష్ణ దేవరాయల యాస్థానమునం దష్టదిగ్గజములని పేరు ప్రతిష్ఠలంగాంచిన కవులలో నీతఁడొకఁడని చెప్పుదురు. శ్రీకృష్ణదేవరాయలు శాలివాహన శకము ౧౪౫౨ వ సంవత్సరమునకు సరియైన తారణ నామ సంవత్సర జ్యేష్ఠ శు ౬ భానువాసరమున స్వర్గస్థుఁడైనట్లీ క్రింది యల్లసాని పెద్దన్న చాటు పద్యమువలనఁ దేటపడగలదు.

ఉ. ఆరయ శాలివాహన శకాబ్దము లద్రియుగాబ్ధి సోముఁన్
దారణ వత్సరంబున నిదాఘమునందున జ్యేష్ఠశుద్ధ ష
ష్ఠీరవివాసరంబున నృసింహుని కృష్ణుఁడు జేరె స్వర్గమున్
ద్వారకనున్న కృష్ణుఁడవతార సమాప్తమునొందు కైవడిన్.

కృష్ణదేవరాయల కాలమునాఁటి కీతఁడు చిన్నవయస్సులోనివాఁడనియుఁ రామరాయల కాలముననే యీతని కవిత సంపూర్ణముగా విజృంభించె ననియుఁ, గొందఱి యభిప్రాయమై యున్నది. తపతీసంవరణోపాఖ్యానమును రచియించిన నాదిండ్ల యప్పామాత్యుని కుమారుని మనుమరాలగు లక్ష్మమాంబ యీతని తల్లియైనట్లును, తెనాలిరామయ్య యీతని తండ్రియైనట్లును గ్రంథములవలనం దేటపడుచున్నయది.

తే. గీ. అరయఁ వరియించె నాదిండ్ల యప్పసూర్య
సుకవి తనయుని దౌహిత్రి సుందరాంగి,
లక్ష్మమా సాధ్వి నైశ్వర్య లక్ష్మితోడ
రమ్యగుణధారి తెన్నాలి రామశౌరి.

# తెనాలి రామకృష్ణకవి చరిత్రము.

ఈతని జన్మస్థానము తెనాలి యైనట్లీతని యింటిపేరే తెలుపుచున్న ది. గృహనామమును గ్రామ నామమును నొక్కటిగా నుండువారలిప్పటి కనేక ప్రదేశములయందుఁ గానవచ్చుచున్నారు. అదియునుం గాక రామకృష్ణకవి తన పాండురంగ మాహాత్మ్యము నందిట్లు చెప్పికొని యున్నాఁడు.

సీ. జగతి సొబగుల నెన్నఁగఁ గావ్యకారల
ఘనుఁడ వాశువునందుఁ గరము మేటి
వఖిల భూమీపాల కాస్థాన కమలాక
రోదయ తరుణ సూర్యోదయుఁడవు
శైవ వైష్ణవ పురాణావళీ నానార్థ
రచనా పటిష్ఠైక రమ్యమతివి
లౌకిక వైదిక లక్షణ చాతుర్య
ధైర్య ప్రభారూఢ కార్యచణుఁడ
తే. గీ. వరయ భూమికుచాగ్రహారాభమైన
శ్రీ తెనాల్య గ్రహార నిర్ణేత వగ్ర
శాఖికా కోకిలమ వీవు సరసకవివి
రమ్యగుణకృష్ణ! రామయ రామకృష్ణ.

ఈతఁడాఱువేల నియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంభసూత్రుఁడు, కౌండిన్యసగోత్రుఁడు.

ఏది యెట్లున్నను తెనాలి రామకృష్ణకవి క్రీస్తుశకము (150[illegible]) పదునేనువందల మైదవ సంవత్సరమునకుఁ బూర్వమే యుండియున్నాఁడ నుట నిర్వివాదాంశమైయున్నది. కృష్ణదేవరాయల యనంతరమున, ఁదరుమలరాయలు, రామరాయలుఁ, గర్ణాటరాజ్యముం బాలించుచున్న ప్పుడు కూడ మన రామకృష్ణకవియుండి యుండెననియు, రామరా[illegible]

భూషణుఁడనెడి భట్టుకవి యీతనికి సమకాలికుఁడనియుఁ జరిత్రము వలనం దేలుచున్నది. అష్టదిగ్గజములని ప్రఖ్యాతిఁగాంచిన, యల్లసాని పెద్దన్న, నంది తిమ్మన్న, అయ్యల రాజు, రామభద్రుఁడు, ధూర్జటి, రాకమాని రామరాజ భూషణుఁడు, తెనాలి రామ కృష్ణుఁడు, పరదేశి మల్లన్న (ప్రౌఢకవి మల్లన్న), పింగళ సూరన్న, యనువారలెనమండ్రుఁగురు కవులును, శ్రీకృష్ణదేవరాయల యాస్థానమందుండిరనియు, నాతని యనంతరమునందు గూడ జీవించియుండి, తిరుమల రాయల యాస్థానమునందునుం గూడఁ దమతమ జీవిత శేషములం గడపిరనియుఁ జరిత్రమువలనం దేటపడుచున్నయది. వారిలో నల్లసాని పెద్దన్న, శ్రీకృష్ణదేవరాయల యనంతరమున, విచారపూర్వకముగాఁ జెప్పిన యీక్రింది పద్యముం జదువనగు.

సీ. ఎదురైనచోఁ దనమదకరీంద్రము డిగ్గి
కేలూఁతయొసఁగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొను వేళఁ బురమేగఁ
బల్లకిఁ దన కేలఁ బట్టియెత్తె
బిరుదైన కవిగండ పెండేరమున కీవ
తగుదని తానెపాదమునఁ దొడిగెఁ
గోకట గ్రామాద్య నేకాగ్రహారము
లడిగిన సీమలయందు నిచ్చె
నాంధ్రకవితా పితామహా! యల్లసాని
పెద్దన కవీంద్రయని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివికేఁగలేక
బ్రదికియుండితి జీవచ్ఛవంబనగుచు.

సాళువ నరసింహరాయల యాస్థానమునందుఁగూడ నీ కవులెనమండ్రు

మ్రిగురున, నుండి యున్నారనియు, నప్పటినుండియు వీరు తమ తమ కవితా కౌశల్యమును జూపుచు, వీరనరసింహ రాయలును, కృష్ణదేవ రాయలును, తిరుమలరాయలును, రామరాయలును, వరుసగా నొకరి తరువాత నొకరు కర్ణాట రాజ్యమును బరిపాలించు కాలములయందు వీ రనుశ్రుతముగా నాస్థానకవులుగా నుండి యుండిరనియుం గూడ గొందఱు మహాశయుల యభిప్రాయమై యున్నది.

క. అనరస మహీమహిళా
జానికిఁ గులసతులు పుణ్యచరితలు తిప్పాం
బా నాగాంబికలిరువురు
దానవ దమనునకు రమయుఁ ధరణియు బోలెన్.

అను పద్యమువలన సాళువ నరసింహరాయలకుఁ దిప్పాంబా నాగాంబికలను నిరువురు భార్యలు గలరనియు, నందుఁ దిప్పాంబిక యందు వీరనరసింహరాయలును, నాగాంబికయందు శ్రీకృష్ణదేవరాయలును, జన్మించిరనియు, వీరనరసింహరాయలు కొంతకాలమునకు రాజ్యమునకు వచ్చెననియు, కృష్ణరాయల యనంతరమునందాతని యల్లుఁడగు తిరుమలరాయలును, బిమ్మట రామరాయలును నను పేరుగల శ్రీకృష్ణదేవరాయల రెండవయల్లుఁడును, రాజ్యమేలినట్లును జెప్పుటకుఁగూడ నాధారములు కలవు.

"వీర శ్రీనరసింహదేవు పిదపన్ విశ్వావనీ మండలీ
ధౌరంధర్యము దాల్చెఁ గృష్ణుఁడు" (వసుచరిత్రము.)

శ్రీకృష్ణదేవరాయల యనంతరమునందాతని యల్లుఁడగు తిరుమలరాయలు కర్ణాటరాజ్యముం బాలించుచుండఁగా, రామరాజ భూషణుఁడను పేరుగల భట్టుకవి యాతనికే తన వసుచరిత్రము నంకితముఁ జేసెను. వసుచరిత్రమునందలి మొదటిదగు నీ క్రింది పద్యమువలన నీసంగతి యథార్థమని తేట పడఁగలదు.

"శ్రీ భూపుత్రి వివాహవేళ నిజమం జీరాగ్రిరత్న స్థలీ
లాభివ్యక్తి వరాంఘ్రిరేణు భవకన్యా లీలయంచుర్ మదిన్
దా భావింప శుభక్రియా కలనచే దద్రిత్నముంగప్పె సీ
తాభామా పతి పోత్రిపుత్రు డిరుమలేంద్ర శ్రీ మహారాయఁన్

తిరుమల రాయని యాస్థానమునందుంగూడ మన రామకృష్ణకవి యుండియున్నను, శ్రీకృష్ణరాయల కాలమునందే, యీతని కవితామతల్లి యెక్కువగా విజృంభణముఁ గాంచినది.

భట్టుమూర్తి శ్రీ కృష్ణరాయల యాస్థానమునందు రామకృష్ణకవిం జూచి, "కుంజరయూథంబు దోమకుత్తుకఁజొచ్చెన్." అను సమస్యనిచ్చి పూరించుమనఁగా; నావంటివాని కేలరా! పూరించుమని సమస్య నొసంగునది యని రామకృష్ణుఁడు కోపించి

క. గంజాయిఁద్రావి తురకల
సంజాతుల గూడికల్లు చవిఁగొన్నావా!
లంజల కొడకా యెక్కడ
కుంజర యూథంబు దోమకుత్తుకఁజొచ్చెన్.

అనిపూరించెను. అది విని శ్రీకృష్ణదేవరాయలు "యీసమస్యమే మొసంగినదిగా భావించి భారతార్థమువచ్చునట్లుగాఁ బూరించు" మని సెలవీయఁగా విని రామకృష్ణుఁడు.

క. రంజనచెడి పాండవు లరి
భంజనులై విరటుఁగొల్వఁ పాలైరకటా!
సంజయ! విధి నేమందును?
కుంజరయూథంబు దోమకుత్తుకఁజొచ్చెన్.

అనిపూరించెను. పై యంశములంబట్టి రామకృష్ణుని జన్మస్థానము తెనాలిగ్రామమనియు, నింటిపేరు తెనాలివారనియు, తండ్రి రామయ్యయనియుఁ, దల్లి లక్ష్మమాంబ యనియు, శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునం దష్టదిగ్గజములని పేరు ప్రతిష్ఠలంగాంచిన కవులెనమండ్రుగురులో నీతఁడొకఁడనియు నిర్ధారణ మగుచున్నది.



## —• బాల్యావస్థ •—

తెనాలి రామకృష్ణుఁడు చిన్నతనమునందు తలిదండ్రులు చెప్పినట్లు వడచుకొనక యాగస్మాకాకివలెఁ దిరుగుచుండెను. చదువుకొనుమని తండ్రి యెంత చెప్పినను వినుపించుకొనఁడయ్యెను. తెల్లవాఱినది మొదలు రాత్రిజామగు పర్యంతము నూరిలోఁ దిరుగుచు, నేవేళనో వచ్చి యన్నము భుజించి పోవుచుండువాఁడు. ఇట్లుండ నొక సన్యాసి తెనాలి దేవాలయమునకు వచ్చెను. ఆ ప్రాంతమునందే రామకృష్ణుఁడు నాటిదినమున తనతోఁడి బాలురతో నాడుకొనుచుండెను. సన్యాసి తన సమీపమునం దాడుచున్న పిల్లవాండ్రఁజూచి, యాటల యందు మిక్కిలి గడిదేఱిన రామకృష్ణునిం దిలకించి, వీనికి మంత్రోపదేశముం జేసినచో బుద్ధి యభివృద్ధియై వృద్ధిలోనికి రాగలఁడని యెంచి యాతనింజూచి, ఓయీ! నీకొక మంత్రోపదేశముం జేసెద; వచ్చెదవా? యని పిలువఁగా రామకృష్ణుఁడాతని యొద్దకేగెను. ఆ సన్యాసియు రామకృష్ణునియందుం గనికరించి, యాతనికి రామతారకమంత్రము నుపదేశించెను. అప్పటినుండియు నాతని కనర్గళప్రవాహమగు కవితాధోరణి గల్గెను.

ఈతని కవితా ప్రసక్తింగూర్చి మఱికొందఱు మఱియొక లాగునఁ జెప్పుచున్నారు:— తెనాలి రామకృష్ణుఁడు తన బాల్యావస్థనంతయును స్వేచ్ఛావిలాసముగా నాటల యందే గడపెననియు, యౌవనప్రాప్తి యగునప్పటి కీతనికిఁ దలితండ్రులు గతించిరనియు, పిమ్మట నీతనికి విద్యయేమియు రామింజేసి, బ్రదుకు త్రోవగానక విచారముతో నతఁడొకనాఁ డూరిబయటనున్న కాళికాలయమునకుం బోయెననియు, నచ్చటికొక సన్యాసివచ్చి యీతనికిఁ గాళిమంత్రము నుపదేశించి యెచ్చటకేనియుం బోయెననియుఁ, బిమ్మట నీతఁడు

తదేకనిష్ఠగఁ గాళీమంత్రపురశ్చరణముం జేయుచుండె ననియు, నిట్లొక కొంతకాలమునకు నప్పటికిఁ గాళికాదేవి యనుగ్రహము గలిగి యాతనికిం బ్రత్యక్షమై, యొక గిన్నెయందుఁ బాలును, నొక గిన్నెయందు పెరుగును, బోసి తెచ్చి యాతని మొదటం బెట్టి యోరీ! రామకృష్ణా! యిందొకగిన్నెలోనిది విద్య; రెండవదానిలోనిది ధనము ఈ రెండింటియందేది నీకుఁ గావలెనో దానిం గ్రోలుమని చెప్పి యా గిన్నెలంజూపి యాతని ముందుంచెననియు, రామకృష్ణుఁడా రెండు పాత్రములంజూచి, తల్లీ! విద్యాధనములు రెండును నాకుం గావలసినవియే! ఇందు నాకక్కరలేనిది లేదని చెప్పుచు నా రెండింటినిం ద్రాగివైచెననియు, నందువలనఁ గాళికాదేవికిఁ గోపము కలిగి శపింప నెంచుచుండఁగా నాతఁడు; తల్లీ! కుమారుని యందాగ్రహము వహించిన మాత యెచ్చటనైనను నుండునా? రక్షింపుము, రక్షింపు మని యా దేవి స్తన్యములనోటఁ బెట్టుకొని స్తన్యపానమొనరించెననియు, నంతట కాళికాదేవి కనుగ్రహము గలిగి, యోరీ! నీవు సకలవిద్యావంతుఁడవును, ధనవంతుఁడవును కాఁగలవు. కాని, వికటకవి వయ్యెదవనియు, నట్లయ్యును, నీకు రాజసన్మానమును నిరంతర సౌఖ్యమునుఁ గలుగుననియు వరంబులిచ్చి యంతర్ధానమయ్యెననియు నప్పటినుండియు. నాతఁడు మహాకవియై రాయల యాస్థానమునఁ జొచ్చి మహాప్రఖ్యాతిం గాంచెననియుఁ జెప్పుదురు. ఏదియెట్లున్నను రామకృష్ణుఁడు మహాకవియై గొప్పగొప్ప యుద్గ్రంథములురచించి ప్రఖ్యాతివడసినవాఁడనుట నిర్వివాదాంశమై యున్నది.



## రాయల యాస్థానప్రవేశము.

సాళువ నరసరాజొకప్పుడు దేశాటనముఁ జేయుచుండఁగా నొక గ్రామమందొక యయ్యవారు బాలురకు విద్యాభ్యాసముం జేయు

చుండెను. నరసరాజచ్చటికేతెంచి విద్యగఱపుచున్న బాలురం జూచి, మీలోఁ దెలివిగలవారెవ్వరో లేచి నిలుచుండుడని చెప్పెను. సాళువ రాజుమాట కందఱును సందేహించుకొనుచుండగా, రామకృష్ణుఁడు లేచి నిలువంబడి, "మహాప్రభూ! నాకు గొంచెము తెలివికలదు" వక్కాణించెను. అంతట వారియుభయుల కీదిగువ సంభాషణము జరిగెను.

రాజు:—వీరందరికంటె నీ వెక్కుడు తెలివికలవాఁడవని యెట్లుచెప్పఁగలవు?

రామకృష్ణుఁడు:—తెలివికలవారెవ్వరో నిలుచుండుమనికదా! తాము మొదట సెలవిచ్చిరి? మీలో నెక్కుడు తెలివికలవారెవ్వరో వారు నిలుచుండవలసినదని తామనలేదు, కాఁబట్టి కొంచెమైనఁ దెలివి లేనివాఁడెచ్చట నుండఁడుకదా యని యాలోచించుకొని యీబాలురతోఁబాటు నేను నొకించుక తెలివికలవాఁడనేకదా యని లేచి నిలువంబడితిని. నాతోఁబాటు తక్కిన యీబాలురందఱును లేచి నిలువంబడుదురనియే యప్పటికి నాయభిప్రాయము. కాని వారట్లు చేయరైరి.

రాజు:—ఒకించుక తెలివిగల సామాన్యుఁడవగు నీవు వీరందఱి కంటె నెక్కువ తెలివిగలవాఁడవని యెట్లుచెప్పగలవు?

రామకృష్ణుఁడు:—తెలివికలవారెవ్వరో నిలువంబడవలసియున్నదని నప్పుడు, ప్రతి బాలునకు నెంతయో కొంత తెలివియుండక మానదు. కనుక నందఱును నిలువంబడవలసినదే. అట్లొనర్పక తెలివి గలిగియుండియుఁ దాము తెలివిహీనులుగా భావించుకొని యెవరి మట్టునకు వారుపేక్షించి నిలువంబడరైరి. కాఁబట్టి వీరందఱును తమ తెలివిని తామే గుర్తెఱుంగలేకపోయిరి. నాతెలివిని నేను గుర్తెఱింగిన వాఁడనగుటచే వీరికంటె నేను ఘనుఁడనుకానా?

ఈ సంభాషణమైన వెనుక సాళువ నరసింహరాయలు రామ

కృష్ణునిం బిలిచి. "మంచి యుద్యోగమిప్పించెద! వచ్చెదవా?" యని యడుగగా రామకృష్ణుఁడు మహాప్రసాదమని యాతనితోఁ గూడఁ బోయెను. విద్యానగరముం జేరగానే యాతండల్లసాని పెద్దన్నగారిని సందర్శించి, తనకుఁ గాళీప్రసాదమువలనం గలిగిన యనర్గళ కవితా ప్రసక్తిచే నాతని మనస్సురంజింపఁజేసి యాతనికోరికపైఁ బునరుక్తిపైఁ బునరుక్తిదోషము లేకుండునట్లీ క్రిందిపద్యము రచించెను.

క. నలుగురు నీనుబలుమారుఁ
గెలుతువు సుగుణోక్తి కాంతి కీర్త్యాకృతులన్
నలుగురు నినుఁ బలుమారుఁ
భళిభళియన కచ్ఛరంగ పాండుర రంగా.

తా. సుగుణములయందు నలచక్రవర్తిని, ఉక్తియందు బృహస్పతిని, కాంతియందు సూర్యుని, కీర్తియందు బలిచక్రవర్తిని, ఆకారమునందు మన్మథుని గెలిచి; జనులందఱు నిన్ను భళీ యను నట్లుగా ప్రకాశించుచుంటివికదా శ్రీరంగ నాథా! యని తాత్పర్యము.

ఈపద్యమునకు సంతసించి పెద్దన్న; రామకృష్ణునిఁ గూడ రాయల యాస్థానమునందొక కవిగాఁ బరిగణింపవలసినదిగా, రాయలతో మనవిచేసికొనెను. అప్పటినుండియు రామకృష్ణుఁడు రాయల యాస్థానమునందలి కవులలో నీతఁడొకఁడుగా భావింపఁ బడుచుండెను.

రామకృష్ణుని రాయల యాస్థాన ప్రవేశముంగూర్చి మఱికొందఱు మఱియొకరీతినిఁ జెప్పుచున్నారు. సాళువ నరసరాజు కాలము పోటికిఁగాక, శ్రీకృష్ణదేవరాయలు రాజ్యమేలుచున్నప్పుడు రామకృష్ణుఁడు రాయలను సందర్శింపవచ్చి, రాయలభార్యలలో నొకతె యగు నన్నపూర్ణాదేవితో సరణముగావచ్చిన కవియగు నంది తిమ్మన్నను కోటగుమ్మమునొద్ద కలిసికొని,

క. "నీకవితా మాధుర్యం

బేకవులకుఁ గలుగనేర్చునే కూపనట
ద్భేకములకు; నాకధునీ
శీకరములచెమ్మ! నందిసింగయతిమ్మా"

అను పద్యమునురచించెను. దానికి సంతసించి, నంది తిమ్మన్న తనకదివఱకు రాయలు బహుమానమొసర్చిన రత్నాలహారముం దీసి రామకృష్ణుని మెడలో వైచెను. ఆ రత్నహారముం ధరియించి, రామకృష్ణుఁడు రాయలను సందర్శింపనేగెను. రాయలీ యపూర్వ మనుజుం జూచి, యీతని మెడలోనిహారము దాను నంది తిమ్మన్నకు బహుమానమొసంగినదియే యని తెలిసికొని, "ఇది నీకెట్లు వచ్చినది? నీవెవ్వరివాడ"వని ప్రశ్నఁజేయఁగా నాతఁడు తనకు నంది తిమ్మన్న తాను రచించిన పద్యమునకు సంతసించి, యిచ్చెనని చెప్పి, యాపద్యమును రాయలకుం జదివి వినిపించెను. రాయలు రామకృష్ణుని కవితా ప్రాగల్భ్యమునకును, తిమ్మకవి యౌదార్యమునకును మిగులసంతసించి రామకృష్ణునిఁ దనయాస్థానము నందుంచుకొని సన్మానించుచుండెను.



## భట్టుమూర్తికి గర్వపరిహార మొనర్చుట.

కాకమాను రామరాజభూషణుఁడు తాను పది పండ్రెండర్థములు వచ్చునట్లుగఁ బద్యములు రచింపఁగలననియు నాశువునందుఁ దనతో సమానముగఁ గవితచెప్పగల కవులెవ్వరును లేరనియు, మిగుల గర్వముగానుండెను. పెద్దనాదికవులీతనికి గర్వపరిహారముఁ జేయుటెట్లని యాలోచించుచుండిరి. ఒక్కనాడు రాయలు ప్రసంగ వశమున భట్టుమూర్తిఁజూచి, గోపికా జలక్రీడా వినోదమునందలి యొక్క యిందీవరాక్షి చేష్టలను వర్ణింపుమని చెప్పఁగా,

శా. ఓలంబాలక యోల యోలయన నోలోలంచు మేలంబునన్
లోలంబాలకయొర్తు గ్రుంకి బిసవల్లుల్ దున్మిపూఁటాడి, కెం

గేలంబూని తటాలునన్నొగసె; నస్మిణాంబు నాథాంబుజా
క్షీలోకంబు జయించి వారల యశశ్శ్రీ మెచ్చు చందంబునన్.

అనిరచియింపఁగా రాయల నాతనికొక బంగారు కడియమును బహుమాన మొసంగెను. ఆ కడియమునుధరించి భట్టుమూర్తి మురియుచుండెను. భట్టుమూర్తికి వెన్నుపైఁదామరయున్నందున నాస్థానమునందుఁ గూర్చున్నప్పుడే స్తంభమునకొఱగంబడి కూర్చుండి, తామరచే జనించిన వీఁపునందలి కండూతిమాన్పుకొనుటకు వీఁపును సదా స్తంభమునకు రాసుకొనుచుండు నలవాటుపడియుండెను. రామకృష్ణుఁడివిషయమెఱింగిన వాఁడగుటచే సమయమారసి, యొకనాఁడు భట్టుమూర్తి యింటికేగి,

ఆ. వె. “అల్లసానివాని యల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు
పాండురంగవిజయ పదగుంభనంబును
గాక మానురాయ! నీ కతగుర!”

అనుపద్యముం జెప్పఁగా, భట్టుమూర్తి సంతసించి తనకు రాయలొసంగిన బంగారు కడియముం దీసి బహుమానమిచ్చెను. ఆకడియముం ధరియించి మఱునాఁడు రామకృష్ణుఁడు రాయల యాస్థానమునకుం బోయెను. భట్టుమూర్తి, పెద్దన్న మొదలగు వారందఱునుగూడ నాస్థానమునకు వచ్చియుండిరి. అంతట రాయలు తాను భట్టుమూర్తికొసంగిన పైఁడి కంకణము రామకృష్ణుని చేతియందుండ టంజూచి “యిదినీకెట్లువచ్చె” నని యడుగఁగా, రామకృష్ణుఁడు తా రచించిన పద్యమునకై భట్టుమూర్తి తనకిది బహుమానముగా నిచ్చెనని చెప్పెను. శ్రీ రాయలా పద్యముం జదువుమనఁగా రామకృష్ణుఁడు నాక్షేపణ పూర్వకముగాఁ బద్యమును [illegible]

ఆ. వె. అల్లసానివాని యల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు
పాండురంగవిజయు పదగుంభనంబును
గాక, మానురాయ నీకతగుర.

అని చదివెను. ఆ సమయమునకే కాక తాళీయ్యాయముగా భట్టుమూర్తి వెన్నెనొక స్తంభమునకు రాచుకొనుచుండెనట అది చూచి యందఱును నవ్విరి. భట్టుమూర్తికి ముక్కుతిమ్మన్న యందెక్కుడు ద్వేషము. అందువలన నాతని నెట్లయినను బరిహాసింపవలెనని రంధ్రాన్వేషణముఁ జేయుచుండెను. ఒకనాఁడు తిమ్మన్న దివాణమునొద్ద సింహద్వారముకడ నేఁటిరో యాలోచించుకొనుచు లోనికేఁగకుండఁగనే నిలువంబడి యుండెను. అంతట భట్టుమూర్తి, తిమ్మనంజూచి పరిహాసించుటకై, "వాఁకిట కావలితిమ్మా" యని చెప్పుచు లోనికింబోయెను. అందుపైఁ బెద్దన్న యా వాక్యము పరిహాసము కాకుండుటకై; "ప్రాకటముగ సుకవివరుల పాలిటిసొమ్మా" అని చెప్పుచు లోనికేగెను. ధూర్జటి "నీ కిదె సత్యముగొమ్మా" యని చెప్పుచు లోనికేగెను. రామకృష్ణుఁడు, "నాకీ పచ్చడమె చాలు నయముగ నిమ్మా" అని నిలువగా ముక్కుతిమ్మన్న తన భుజముపై నున్న యా పచ్చడముం దీసి రామకృష్ణునకు బహుమాన మొసంగెను. రామకృష్ణుఁడా పచ్చడముం ధరించి లోనికేఁగిన తరువాత నందఱును సభకేతెంచిరి. రాయలు రామకృష్ణుఁడు ధరించిన పచ్చడముం జూచి "ఇదేమి రామకృష్ణా! ప్రతిదినము నేవో యొక క్రొత్త వస్తువు ధరింపుచుందువే! నీకీ పచ్చడమెక్కడిది" ప్రశ్నింపఁగా దాని యుదంతమునంతయు రామకృష్ణుఁడు వాకొన్చెను.

ఒకనాఁడు నంది తిమ్మన్న తన వాఁకిటం గూర్చుండగాఁ ...

నాది కవులచ్చటికివచ్చి, యెవరికిఁదోఁచినట్లువారు కవితంగూర్చి, యుపన్యసించుచుండిరి. తిమ్మన్న యింట నెప్పుడుఁ బదిమంది పండితులకు దక్కువగాఁ గూర్చుండియుండుట యరుదు. అతడూరక యెన్నఁడును గూర్చుండువాఁడుకాఁడు. ఏ పండితునితోడనో సద్గోష్ఠియుండే కాలము గడుపుచుండువాఁడు. ఆ సమయమునఁ దిమ్మన్న యేదో చెప్పుచుండెను. అప్పుడే భట్టుమూర్తియు నా వీధింబోవుట తటస్థించెను. భట్టుమూర్తి తిమ్మన్న వైభవముం జూచి యోరువంజాలక తిమ్మన్న వాఁకిటయందుండు కవీశ్వరులందఱును పందులయొక్క సమూహమే యనియు, వాఁకిటయందు కాపుండువాఁడే తిమ్మన్నయని నిరూపించుచు దనతోఁగూడ వచ్చుచున్న తన శిష్యుఁడగు మాధవుఁడను పేరుగల యొక భట్టుపిల్లవానిం జూచి,

క. వాఁకిటికావలి తిమ్మని
వాఁకిటి కవికోటి మాధవా! కిటికోటే

అని చదివినాఁడు. ఆ పద్యమును బూరింపవలెనని మాధవుఁడుద్యుక్తుఁడై యాలోచించుచుండెను. రామకృష్ణుఁడాదారిం బోవుచు నదివిని,

క. ప్రాకృత సంస్కృత ఘూర్జర
మూకీకృతకు కవితుంగ ముస్తాతతికిన్
వాఁకిటి కావలి తిమ్మని
వాఁకిటి కవికోటి మాధవా! కిటికోటే.

అని పూరించెను. అనఁగా, ప్రాకృతము, సంస్కృతము, ఘూర్జరము త్రొక్కడము చేసి కవిత్వము చెప్పునట్టి దుష్టకవీశ్వరులను తుంగముస్తల పాలింటికి దిమ్మన వాఁకిటియందలి కవులు పందులవంటివారే యని భావము; అంతటితో భట్టుమూర్తికి గర్వపరిహారమై యప్పటినుండియు, నాతఁడీ కవులతోఁగలసి మెలసి మైత్రితో వర్తించుచుండెను.



## దినమునకు నూఱు తప్పులకు రాయలయొద్ద ఫర్మానాను పొందుట.

ఒకనాఁడు రాయలును, కవీశ్వరులును గలసి విలాసార్థము తుంగభద్రానదిం దాఁటి, చాలదూరము పోయియుండిరి. అప్పుడు రాయలతోఁ గొలఁదిపాటి సిబ్బందిమాత్రమే యుండెను. కనిగిరికి రాజు వీరభద్రజగపతికి, సామంతుఁడును దండనాథుఁడునగు పసరము గోవిందరాజను నాతఁడు, రాయలం జంపుటకు జాలకాలము నుండి సమయము వేచియున్న వాఁడగుటం జేసి, తన చతురంగ బలంబుల తోడను వచ్చి, యా నిర్జనప్రదేశమున రాయలం దాఁకె. నా రాయల యొద్దనున్న కొలఁదిపాటి సిబ్బందియు గోవిందరాజు ధాటికోర్వలేక, పలాయనమగుచుండిరి. రాయల కపజయము కలుగునంతటి దురవస్థ సంభవించెను. పెద్దనాది కవులందఱును చేయునది లేక తగినయుపాయము నారయుచుండిరి. వచ్చినది నిర్జన ప్రదేశము. వంటలవారును సేవకులును దప్ప సైనికు లెవ్వరును నచ్చటఁ దమకుఁ దోడు లేరైరి. అప్పుడు రాయలు చేయునది లేక, పెద్దన్నగారికి నమస్కరించి, "మీరందఱును నాకు జయమగునట్లు లాశీర్వదింపుడు. నేఁడు నేను గోవిందరాజును హతమార్చి వచ్చెదను" అని చెప్పి తన కరవాలమును దీసికొని, తాను రణమునకుఁ జొచ్చె నేనుగుం బోలె రాయలు గోవింద రాజుని సైన్యముపైఁబడ రాయల ధాటికిఁ గాఁగలేక చెల్లాచెదరై హతులగు చుండిరి. అంతట గోవిందరాజు రెట్టించిన కోపముతో వచ్చి రాయలం గడిసెను. రామకృష్ణుఁడు రాయలకంటె ముందుగాఁ బోయి, తన కవితాతేజము విజృంభింపఁగాఁ బెద్దకొలుఁగనఁ

క. జసవనకుఁ బుట్టినపుడే
పసరము గోవిందరాజు పసరం బైనన్

గనవేటికిఁ దినఁడనఁగఁ
గనవుందిరు శత్రులాజిఁ గదిసినవేళన్.

అని తిట్టెను. ఆ తిట్టు ఫిరంగిదెబ్బకంటెను నెక్కువపెట్టున గోవిందరాజు శ్రవణమార్గమునం బడిపోయి యాతని గుండెకాయను శతధా వ్రక్కలుసేసివేయఁగా, నాతఁడు రక్తముం గ్రక్కుకొనుచు, గుభిల్లు మన్నిసేలంగూలి మృతినొందెను.

గోవిందరాజు గోవిందా యగుటతోడనే సైన్యమంతయు దైన్యంబుజెంది, చెల్లాచెదరై పాఱిపోయిరి. అంతట రాయలు రామకృష్ణుని నిరాఘాట భీషణకవితా పటిమంజూచి నెఱఁగంది "రామకృష్ణా! నీకవిత యందిట్టి మాహాత్మ్యము గలదని యెఱుంగనైతి. ఆహవమునందు నా కేమాత్రపు శ్రమముం గలుగనీయక నీభీషణ శాప్య కవితాధారాశతఘ్నిచే వైరి వీర నిర్మూలనంబుం గావించిన వాఁడవు. నీవెద్దికోరిన నది నీకీయనగును. కోఁతివేని నా రాజ్యమైన నొసంగుటకు సంసిద్ధుఁడను కోరికొ"మ్మన రామకృష్ణుఁడు! "దేవా! దేవరవారి కరుణారసపాతంబునంగదా! నా కవిత యింతగా విజృంభింపఁగలిగె. ఇందులకై నన్నింత శ్లాఘింపనేల! ఈ బహూక్తిత వాక్యములకన్న రాజ్యము నాకెక్కుడుగా నానందముం గూర్పఁ జాలదు" అనవుఁడు "నీవెద్దియైనం గోరుకొనకతప్పదు. కోరుకొమ్ము" నఁగా రామకృష్ణుఁ డట్లయినఁ గోరుకొనియెద నడ్డుసెప్పక యొసంగ వలయుం జుమీ యని, రాయల నొప్పించి, "నేను దినమునకు నూఱపరాధముల నొనర్చినను, వానినన్నింటిని దేవరవారుమన్నించి యూరకొనుటకు వరమ్మొసంగవలసిన"దనెను. రాయలందుల కంగీకరించి, "నీవు నూఱుతప్పులు చేసిననుసరియే! వేయితప్పులొనరిఁ నను సరియే నిన్నేమియు ననంగలవాఁడగా"నని రాయలు బాసచే

యుభయహస్తమిచ్చెను. అప్పటినుండియు రామకృష్ణుడు రాయల యాస్థానమునందో, పట్టణమునందో, యింటియందో, యేదోయొక పొంటిపని జేయుచునేయుండెను.





## — తాతాచార్యులను పరిహసించుట —

రాయలకు తాతాచార్యులయందు గురుభక్తి యెక్కువ. తాతాచార్యులవారు రాయలకు మతగురువు. మిక్కిలి చదువుకొనిన పండితుడు. అట్లయ్యును నాచార్యులవారికి శ్రీవైష్ణవ మతమునందు పక్షపాతమెక్కువగా నుండెను. స్మార్తులం గనినంతనే తనయుత్తరీయమును మొగమునకుఁ జాటుకట్టుకొని, పోవుచుండువాఁడు. స్మార్తులతో మాటలాడుట యనిన నాతనికి ప్రాణము పోయినట్లుండెను. ఇదిచూచి, యాచార్యులవారు పరమ ఛాందసులనియును, పరమత ద్వేషులనియును, నితరులఁజూచి యోర్వఁజాలరనియును, పరమనీచజులనియును, బలువురు పలువిధములుగాఁ బరోక్షమునను సమక్షమునను దూషించుచుండువారు. ఈ సంగతి రాయలకుం దెలిసి, దైవసమానులగు గురువుల నేమియు ననుటకును నోరు రామిచే రామకృష్ణుని రహస్యముగాఁ బిలిచి “తాతాచార్యులవారికిఁ బరమతద్వేషులనియు, వాచాటులనియు దుష్కీర్తి కలుగుచున్నది. గురువులగుటచే నేనేమియును మందలింప జాలకుంటిని. గురువులకు నొప్పికలుగకుండ నేమైన వలయును. గురువుల కపఖ్యాతి గలిగినచో నది నాయదిగాదే కదా! కావున దప్పరించి యూరకుండజాలను. ఇందుల కేమైన నుపాయముం జెప్పెదవా?” యని యడుగగా, రామకృష్ణుడు, గురువుల నిందింపనక్కరలేకయే యుక్తిజేసి చూపి తాతాచార్యులను

లించెదనని రాయలతోఁ బలికి యింటికేగెను. మరునాఁడు రామకృష్ణుఁడాచార్యుల యింటికేగి_ "తాతగారూ! తాము మాటిమాటికిని సభయందు గూర్చున్నప్పు డుత్తరీయమును మొగమునకుఁ జాటు పెట్టుకొందురు ఒక్కొక్కప్పుడొక్కొక్కనితో ససహ్యముగా సంభాషించుచుందురు. కారణమేమి" మని యడుగఁగా, నాతఁడు, "ఓరీ రామకృష్ణా! వినుము. మఱియేమియుంగాదు వైష్ణవమతము మిక్కిలి పుణ్యదాయకము. స్మార్తమతమువంటిఁ బాపిష్ఠిమతము వేఱొకటిఁ లోకమునందులేదు. స్మార్తులు మొగముజూచినచోఁ దప్పక గాడిద పుట్టుక రాగలదు. అకారణముచే నేనెన్నఁడును స్మార్తుల మొగముఁ జూడనని ప్రతిజ్ఞ చేసికొనియున్నాను. అందువలన స్మార్తులమొగము నాకగపడకుండఁ జేసికొనటకై మొగమున కుత్తరీయము నడ్డుపెట్టుకొనుచుందు"నని చెప్పెను. ఇదియైన కొంత కాలమునకు, రాయలును తాతాచార్యులును, సరదార్లు, సామంతులు, మున్నగు వారితోఁ గూడఁ గాలినడకను పట్టణముబయటకు విహారార్థమైపోయిరి. అచ్చట గొన్ని గాడిదలు మేయుచుండెను- అప్పుడు రామకృష్ణుఁడు మెడకుఁ దన యుత్తరీయముం జుట్టుకొని, యొక్కొక్క గాడిదయొద్దకు నేగి, సాష్టాంగ నమస్కారము జేయుచు వచ్చుచుండెను. ఈ వికటవర్తనముఁజూచి యందఱును నవ్వసాగిరి- రాయతాతనింజూచి "యిది యేమి రామకృష్ణా! నీకుమతిపోయినదాయేమి? గాడిదలకు మొక్కుచున్నావేమని యడుగఁగా, రామకృష్ణుఁడట్లనకుఁ డన్లనకుఁడు, చాల పాపము సంభవింపఁగలదు- ఇదిగో! ఈగాడిద సాక్షాత్తు మన తాతాచార్యులుగారి తండ్రిగారగు శేషాచార్యులుగారు సుమండీ! ఇది, యాచార్యులవారి మేనమామ వరదాచార్యులుగారు! ఈయుక్త గాడిద మన యాచార్యులుఙ్గారికి సాక్షాత్తు మాతా మహులగు రామానుజాచార్యులువారు. ఈ ముద్దుగాడిద కేవలము మనగురుప్ర

గారికిఁ బితామహులు- అప్పలాచార్యులుగారు సుమండీ! స్మార్తుల మొగముఁజూడఁబట్టి వీరికీపుట్టుకలు సంభవించినవి కాని, లేనియడల వీరీపాటికి వైకుంఠమునందు శ్రీమహావిష్ణువు సన్నిధానమునం జేరి శ్రీమహావిష్ణువులో నైక్యానుసంధానము కాఁదగినవారే! ఇంకను మీరెఱుంగరు కాని, శ్రీవైష్ణవులు స్మార్తుల మొగముఁ జూచినచో వారిఁ దప్పక గాడిదపుట్టుకలు రాగలవు. అంతటంతటిమహానుభావులకే యిట్టిపాటు సంభవించినప్పుడు, ఇఁకనమన నెంతటివారము? నేనెన్నఁడును స్మార్తుని మొగముమాత్రము చూడను బాబూ! ఒకవేళ పొరపాటునఁజూచినయడల నిట్టి గాడిదలకు మ్రొక్కినచో నాదోషము పోఁగలదని మ్రొక్కితిని. ఈగాడిదలన్నియుఁ బూర్వజన్మమునందు మన గురు పరంపరలోనివారనియే నా యభిప్రాయము. అట్లుఁగానిచో గాడిదలకు మ్రొక్కుటకు నేనంత తెలివి తక్కువవాఁడనా? యనెను. అంతట రాయలు "ఇదేమి రామకృష్ణా! స్మార్తులమొగముఁ జూచినచో గాడిదపుట్టుక వచ్చునా? ఇది యే శాస్త్రమునందున్నది? ఈగాడిదలన్నియు మనగురువుగారి పెద్దలా? నీవు నీయిష్టమువచ్చినట్లు వదరుచున్నావా? నీవుమాత్రము స్మార్తుఁడవు కావా? అని రామకృష్ణునిపైనలిగెను. అందుపై రామకృష్ణుఁడు "అయ్యా! ఇది యే శాస్త్రమునందున్నదియో నే నెఱుంగను. స్మార్తులమొగముఁ జూచినవారికిఁ దప్పక గాడిదపుట్టుక రాఁగలుగునని మన తాతాచార్యులువారు మొన్నటి దినమున నాతో ననిరి. అప్పటినుండియు సాధారణముగా గాడిదలన్నియుఁ బూర్వజన్మమునందు శ్రీవైష్ణవాగ్రేసరులనియు, స్మార్తులమొగముం జూడఁబట్టియే వారికీ పుట్టుకలు కలిగెననియు నాకు మనస్ఫూర్తిగా నమ్మకము కలిగెను మీరెన్ని తిట్టినను సరియే కాని, యీగాడిదలన్నియు విశిష్టాద్వైతమునం దాఁటితేటిన మన యాచార్యులవారి పూర్వులనియే నా

యఖిప్రాయము. ఇంకను నామాట యసత్యమైనచో నెవ్వరికి గాడిద పుట్టుక కలుగునో మనతాతాచార్యులవారి నడుగుడు!” అని యూర కుండెను. రాయలాచార్యులవైపునకు మోమును దిప్పఁగా నాచా ర్యులువారు తలవంచుకొని యూరకుండెను. తరువాత విహారమును జాలించి సాయంకాలమున కందఱును పట్టణమున కేతెంచి, యెవరి నివాసములకు వారు పోయిరి. అది మొదలాచార్యులవారు స్మార్తులం జూడవలసినప్పుడు మొగమున కుత్తరీయము నడ్డుపెట్టుకొనుట మాని వైచి సర్వమతములయందును సమ్మతముగానే సంచరించుచుండెను. రామకృష్ణుఁడొనర్చిన యీ యుక్తి కందఱు నాశ్చర్య పడఁజొచ్చిరి. తాతాచార్యులంతటివానిని సద్వర్తనమునకుం దెచ్చుటసామాన్యమా?

తాతాచార్యులవారికి ఛాందసము మెండు. ఒకనాఁడు రామ కృష్ణుఁడు తనతోఁటలో దిరుగుచుండగా, నొక కాకి యాతని వ్రేలిపై రెట్ట వైచెను. అప్పుడు రామకృష్ణుడా రెట్టం గడిగి కొనకుండఁగనే, తాతాచార్యులయొద్ద కిరిగి, “అయ్యా! నా వ్రేలిపైఁ గాకి రెట్టవైచి నది. ఇందులకుఁ బ్రాయశ్చిత్తమేమని యడిగెను. అందుల కాచా ర్యుఁడు మలముపడిన యే యవయవమైనను, శరీరమునందుండఁ దగదు. దాని నచ్చటికి ఖండించివేయవలయును, లేనిచో రౌరవాది నరకములకుం బాత్రుఁడగును, అని చెప్పెను. రామకృష్ణుఁడందునకు, “స్వామీ! మలమనిన మనుష్యులమలమా! జంతుమలమా? గోమ యమువలననే కదా! ఉచ్ఛిష్టములన్నియుం బోవుచున్నవి? మీ రట్లనెదరేల?” అని యడుగఁగా, “నోరీ! జంతుజాలమునందన్నిటి మలములయందును గూడ నిట్టి పాపమే యున్నది! ఒక్క గోమయ మునకు మాత్రము పుణ్యఫలితముకలదు. నరమలము మిక్కిలి పంక హేతువు. నరోచ్ఛిష్టములం భుజించు వాయసమలమంత కంటెనుం బాపహేతువు! కాఁబట్టి నీవ్రేలెంతపఱుకును వాయసమలమంటినదో,

యంతవఱకును నఱికివైచుకొన్నచో నా దోషము నివారణమగును. కాకున్నచో నరకము తప్పదని యాచార్యులనియెను. అట్లనే యొన ర్చెదనని రామకృష్ణుఁడింటికేగి, యా వ్రేలిని మడిచి యొక దారముతోఁ గట్టిపెట్టి, మడిచియుంచుకొనుట కనువుగా నుండునట్లు లల వాఁటు గావించుకొని, యాచార్యులవారి సమక్షమునకుఁ బోవలసి వచ్చినప్పుడా వ్రేలిని మడిచి మొండివ్రేలుగా నగపడునట్లు మడిచి పట్టి చూపించుచు వచ్చుచుండెను. పిమ్మట రామకృష్ణుఁడు, కొంత ప్రదేశమునకు నాల్గువైపుల గోడలు కట్టించి, దానికొకవైపునొక గుమ్మ మెత్తించి, యా ప్రదేశమంతయు రెండు నిలువుల గోయిగా నుండు నట్లు చేయించి, యా గోతిని మలముతోఁ బూడ్చివైచినచోఁ గొంత ధనమిచ్చెదనని పాకీవాండ్రకుఁ జెప్పి, వాండ్రకుఁ గొంతధనమిచ్చి యా గోతిని మలముతోఁ బూడ్పించెను. పిమ్మటఁ దొలకరివానలు గురిసినతోడనే యా ప్రదేశమునందుఁ దోటకూరగింజలు చల్లించెను. కొన్ని దినములగునప్పటికి తోఁటకూర బాగుగాఁ బెరిగినది. మలమం తయు, మన్నుగా మాఱిపోయినది గాని, యా మన్నెజాతిమన్నో తెలిసికొనుటకు మాత్రము తగినట్లుగా, భూమికి గంధగుణము కలదని చెప్పు తార్కికుల తర్కమున కనువాదముగా నుండెను. క్రొత్తగాఁ బూడ్పబడిన గోయి యగుటచే నెక్కడ నిలుచుండినను గుత్తుక బంటిగా దిగఁబడుట కనువుగా నుండెను. అది శ్రావణమాసము శ్రా వణబహుళ పంచమినాఁడు తాతాచార్యులవారి తండ్రిగారి తద్దినము తాతాచార్యులు తొలిదినముననే సమస్త శాకములును సమకూర్చు కొనెను. కాని సార్థకనామముగల తోఁటకూర మాత్రము మెచ్చుటను నాతనికి లభింపలేదు. సాయంకాలము కావచ్చినది. అప్పుడు తాతా చార్యులవారు వీధియరుగుపై గూర్చుండి, వచ్చువారినిం బోవువారినిం బిలుచుచుఁ, "తోఁటకూర నెచ్చటనైనను దొఱకునా? తగినంత

వెల యిచ్చెదము!" అని యడుగుచుండెను. ఆ సమయమున రామకృష్ణుఁడు రాయల యాస్థానమునందుండి యింటికేగుచు, నాచార్యుల వారిని దర్శించి, కుశలప్రశ్నముఁజేసెను. మరుసటిదినము తన తండ్రి తద్దినమనియు, సమస్త శాకములు సమకూడినవి కాని, సార్థక నామముగల తోటకూరమాత్రము సందర్భముకాలేదనియు, నాచార్యుఁడనెను. "మాదొడ్డియందుఁ గావలసినంత తోటకూరగలదు మీరు వచ్చి పట్టించుకొని పోవచ్చునని రామకృష్ణుఁడనెను. తాతాచార్యుఁడంపులకు సంతసించి, "ఓరీ! ప్రతిఫలమేమయినం దీసికొని మఱి యియ్యవలయుంజుమీ! కాకున్నచోఁ బిత్రుకార్యమగుటచే మాకిది పనికిరాదు అనియెను, తమసెలవుప్రకారము చేసెదనని రామకృష్ణుఁడాచార్యుం దోడ్కొని, తనయింటికిం దీసికొనివచ్చి, యొక తివాసి పయిం గూర్చుండఁబెట్టి అయ్యా! నాకు కడుపునొప్పిగానున్నది. నే నావలకుఁ బోయివచ్చెదను. తమకభ్యంతరమేమియున్నది? అదిగో! ఆదొడ్డితలుపుఁ దెఱచుకొనిపోయి యందలి తోటకూరను మీరుఁ గావలసినంత తీసికొనిపొండు అంతలో బహుశా నేనును వచ్చెదను. అనిచెప్పి యావలికిం బోయెను. తాతాచార్యుఁడుం తోఁటకూరకై దొడ్డితలుపుఁదెఱచుకొని, వడి వడిగా నాల్గడుగులువైచి, పది తోఁట కూరచెట్లు నెట్టెట్టో యూడఁబెఱికి, చంకనిడుకొని, యడుగులు దిగఁబడ, దిగ బడఁ, గుత్తుక బంటిగా దిగఁబడిపోయి, యతిప్రయాసము మీద గుమ్మముదాపునకువచ్చి బ్రతుకుజీవుఁడాయనియీావలబడెను. ఒడలంతయు సగము చిలికినమలముచే నలఁదుకొనిపోయెను. అంతకు ముందే రామకృష్ణుఁడు గుమ్మము దాఁపునకువచ్చి, "ఆయయ్యో స్వామీ! ఈవైపుననుండిపోవక యావైపునకుంబోతిరా! మలపుగోతిలోఁ దిగఁబడిపోతిరికదా! కుత్తుకబంటిగాదిగబడిపోయితిరి! అంటు కూడఁబడిపోయితిరి! కుత్తుకవఱకు నరికైవైచుకొనినంగాని తమకు

బ్రాయశ్చిత్తము లేదుకదా! మీకు రౌరవాదినరకము సంభవింపఁ గలదు! కుత్తుకవఱకును నరికినైచుకొందురుగాని తమవంటి మహా నీయులు నరక మనుభవించుట కొడంబడుదురా! స్వామీ! యని హెచ్చరించెను. ఇదియంతయు రామకృష్ణుఁడొనరించిన కొంటె తన మనియు, తాఁ జెప్పిన ధర్మశాస్త్రము తుదకుఁ దనపీఁకిమీఁద కేవచ్చిన దనియుఁ బశ్చాత్తాపముం జెంది యింటికింబోయెను.

మఱియొకప్పుడు తాతాచార్యులుగారే లోకమునం దెక్కువ ఘనులనియు, సమస్తవిషయములయందును నీతనికి సాటివచ్చువారీ లోకమున నెవ్వరునులేరనియు, శ్రీకృష్ణదేవరాయులు తన సభయం దుపన్యసించెను. రాయలమాట కడ్డు నుడువఁజాలక యందఱూర కుండిరి. ఆంధ్రకవితా పితామహుఁడగు నల్లసాని పెద్దన్నగారి గురు వగు శఠగోప తాపసులవారచ్చటికి వచ్చి యుండఁగా, రాయులు గురువులం బూజించుటలో, మొట్ట మొదట తాతాచార్యులవారినే పూజింప వలయునని చెప్పుచు "శఠగోపతాపసః పూర్వమ్ తాతః పూజ్యోనసంశయః" అనివాక్రుచ్చెను. అంతట రామకృష్ణుఁడు లేచి నిలువంబడి "ముఖంప్రక్షాళనాత్పూర్వం గుదంప్రక్షాళనం యథా" అని శ్లోకశేషముం బూరించెను. (అనగా ముందుగా గుదప్రక్షాళ నముం గావించుకొనిన పిదప, ముఖప్రక్షాళనము గావించుకొనుట యెటో యట్లనే తాతాచార్యులవారినిఁ బూజించిన పిదప, శఠగోప తాపసులను బూజింపవలయునని భావము.)

కృష్ణదేవరాయ లొకప్పుడు, తాతాచార్యులవారిం గూర్చి చ్చటింపుచుఁ దాతాచార్యుల సమక్షమున నపశబ్దముచ్చరించినను సుశబ్దముగానే మార్చఁగలడనియు, నందువలన నాతని యెదుట శబ్దములేదనియి నుడువుచు, "అపశబ్ద భయంనాస్తి తాతాచార్య సన్నిధౌ" అని వక్కాణించెను. అప్పుడు రామకృష్ణుఁడు "అనా

చారభయం నాస్త్యష్టన్ మూత్రిస్యసన్నిధౌ" అని పూరించెను. (అనఁగా దాతాచార్యులవారియొద్ద నపశబ్దభయమునులేదు- నిలుచుండి లఘుశంకజేయు వారియొద్ద ననాచారభయమున్నులేదు, అని భావము.) అదివిని యందఱును నవ్విరి. రామకృష్ణునకు దినమునకు నూఱుఅపరాధముల కాజ్ఞయిచ్చినవాఁడగుటచే రాయలతని నేమియు ననక యూరకుండెను.

---

## —: మేధావిభట్టు :—

కొంకణదేశమున మేధావిభట్టను నొక పండితుఁడు గలఁడు. ఆతఁడు సకల విద్యాపారంగతుఁడు. ఆతనికంటె గొప్ప విద్వాంసుఁ డెవ్వఁడు నా దినములయందు లేకుండెను. ఆతఁడు ప్రతిదేశమునకుం బోయి, యా యా దేశములయందలి పండితుల నందఱనోడించి జయపత్రములును, బిరుదములును గైకొని రాఁ దిరువనంతఃపురమును బాలించు వీరభూపాలదేవుచే ననుజ్ఞాతుండయి, యాతని యొద్దనుండి కావలసిన పరికరములును, ధనమునుం గైకొని దేశాటనము జేయుచు, విద్యానగర రాజ్యమున శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునం దష్ట దిగ్గజములను బిరుదువహించిన కవిశ్రేష్ఠు లుండిరనియు వారఖండ విద్యాపారంగతులనియు విని, యా కవులం జయించి, బిరుదులం గైకొనవలయునను కుతూహలముతో విద్యానగరమున కేతెంచెను. అతఁడా దేశమునకుఁ గ్రొత్తవాఁడగుటచేఁ, బట్టణమునందలి విశేషములను; నచ్చటిపండితుల గుట్టుమట్లను కనుఁగొనవలయునని యొ ప్రచ్ఛన్నముగా బట్టణమునం దిరుగుచుండెను. ఇట్లు రెండుమూ దినములు గతించిన తరువాత, రామకృష్ణుఁడీ యుదంతము నె గ్రహించి, యొకనాఁడు సూర్యోదయము గాకుండఁగనే, లేచి య

సేవకుని వేషమును వైచుకొని, రాయలవారి కోటగుమ్మముకడ నిలువంబడి, యీ క్రింది పద్యముం జదువుచుండెను.

శా. సమ్మర్ధక్షమ! ధీనిబంధన విధా సంక్రిందనాచార్య! దూ
రమ్మన్యాచల వజ్రిపాత! జగతీ రక్షాంబుజాక్షా! శర
ధ్యమ్మార్గస్థ దశాస్య రాజ్య సమసహ్యాపోద్భవాతిరంభా
గుమ్మత్తారి శివంసముద్రిపుర వపోన్మాల నాడంబరా.

మేధావిభట్టు స్నానమునకై తుంగభద్రానదికిం బోవుచుం గోటగుమ్మముకడఁ గైవారమొనర్చుచున్న సేవకునిం జూచి ఇంతటి కఠినమైన పద్యము, వీఁ డెట్లుచదువఁగలిగెనని, వెఱగందె; “ఒరే! నీ వ్వరివాఁడ” వని యడిగెను “అయ్యా! నేను గొఱ్ఱములుకాచి జీవించుచున్నవాఁడను. తెనాలి రామకృష్ణుని సేవకుఁడను” అని బదులుచెప్పెను. “రామకృష్ణుఁడన నెవ్వఁడు? ఆతనికేమిపని?” యని యడుగఁగా, రామకృష్ణుఁడు “ఎఱుఁగరా బాబూ? రాయలవారి యాస్థానములో నష్టదిగ్గజములని ప్రఖ్యాతివహించిన విద్వత్కవు లెనమండ్రుగలరు వారిలో చిన్నవాఁడు రామకృష్ణుఁడు.

మేధావి—వయస్సునకా? పాండిత్యమునకా? ఏరెండు చిన్నవాఁడు?

సేవ—అన్నిటియందునుం గూడ చిన్నవాఁడే?

మేధావి—వారిలో మేటి పండితుఁడెవ్వఁడు?

సేవ—ఆంధ్రకవితా పితామహేత్యాది బిరుదాంకితుఁడగు నల్లసాని పెద్దనామాత్యుఁడు.

మేధావి—ఓరీ! వీరిం గుఱించి నీకు బాగుగాఁ దెలియునా?

సేవ—మా యజమానుని గుఱించి నేను బాగుగా నెఱుంగుదును. ఆతనికి సేవ యొనరించుచున్న హేతువువలన నాకును గొంత గవిత్వముసెప్పుట యలవడినది. కాని తక్కినవారిని గుఱించి నా కం

తగాఁ దెలియదు. అందఱకంటె నల్లసాని పెద్దన్న ఘనుఁడని చెప్పుదురు.

మేధావి—అట్లనా? సరే! అట్లయినచో నాశువుగా నేదేని యొక పద్యముం జెప్పఁగలవా?

సేవ—తెనాలి రామకృష్ణునకు సేవకుఁడనై యుండియు నాశువుగా నొక పద్యమే యుచ్చరింప లేకపోవలయునా బాబూ? మీరు పెద్దపండితులవలెఁ గనఁబడుచున్నారు! నేను పద్యముం జెప్పెదను. దానికి మీరు వ్యాఖ్యానముం జెప్పవలయును సుమండీ! మనకిద్దఱకును దగవు గలిగినచో రామకృష్ణునియొద్దకేగి యా తగవుఁ బరిష్కరించుకొందము.

మేధావి—దీనికిఁ దగవెందుకురా! నీకు గావలసినన్ని వ్యాఖ్యానములం జెప్పెదను! ఏదీ! నీ సామర్థ్యముం జూతమని కుతూహలము కలిగి యడిగితిని. ఒక్క పద్యముం జెప్పుము, చాలును. అందు నీ సామర్థ్య మగపడఁగలదు!

సేవకుఁడు వినుండని పద్యము రచించి యిట్లు చదివెను.

క. నరసింహ కృష్ణరాయని
 కరమఱుదగు కీర్తి కాంత • కరిభిద్గిరిభి
 త్కరి కరిభిద్గిరి గిరిభి
 త్కరి భిద్గిరిభిత్తురంగ • కమనీయంబా

అనఁగా సాళువ నరసింహరాయలు కుమారుఁడగు కృష్ణదేవరాయల యొక్క కీర్తి, కరిభిత్=గజాసురునిఁ జంపిన యీశ్వరునివలెను, గిరిభిత్కరి=పర్వతములను దెగనఱి-న యింద్రుని యొక్క యేనుఁగగు నైరావతమువలెను, కరిభిద్గిరి=ఈశ్వరుఁడు నివసించు పర్వతమగు కైలాసమువలెను, గిరిభిత్తురంగ=దేవేంద్రునియొక్కయు, యీశ్వరుని

యొక్కయు వాహనములగు (గుఱ్ఱములగు) నుచ్చైశ్శ్రవము, గోవృషభములవలెను, తెల్లని ప్రకాశము గలదని భావము.

మేధావి భట్టీ పద్యమును విని, రామకృష్ణుని గుఱ్ఱములను గాచువాడే యింతటి పద్యము నాశువుగాఁ జెప్పఁగా రామకృష్ణుఁ డెంతటివాఁడై యుండునో యనియు, నందఱికంటెఁ జిన్నవాఁడగు రామకృష్ణుఁడే యింతటివాఁడై యుండఁగాఁ దక్షిణ కవులెంత ప్రజ్ఞాశాలులో కదా యనియు వెఱఁగంది, తనకిచ్చట జయము కలుగుట సంశయాస్పదమని భావించి, పట్టణమువిడిచి వెంటనే పడలిపోయెను.- మరునాఁడు రాయలాస్థానమునందుఁ గొలువుదీర్చియుండఁగాఁ, దిరువనంతపురమునుండి యొక వార్తావహుఁడు వచ్చి, రాయలకు సందర్శించి, యొక జాబునిచ్చెను- ఆజాబునందిట్లుండెను-

శ్రీ శ్రీ శ్రీ రాజరావుతుగండ, రాజాధిరాజ, రాజమార్తాండ మూరురాయరగండ, వీరాధివీర, వీరప్రతాప, వివిధ విద్యాప్రసంగ, విశ్రుతగుణాఢ్య, సంస్కృతాంధ్ర కవితావిస్తీర్ణచేతోవిజృంభమాణ సకలరాజన్యానీకసంస్తవనీయవదాన్యాభినవభోజరాజ, సమ్యక్సన్నశోవిస్తారితేదులశాహేత్యాది యవనవైరి వీరసగ్రహ; మహారాజ రాజశ్రీ శ్రీకృష్ణదేవరాయల సముఖమునకు, తిరువనంతపుర మహారాజశ్రీ వీరభూపాల దేవప్రతాపరాయలు వ్రాయు విజ్ఞాపనములు, మా పండితుఁడు మేధావిభట్టు తమసముఖమునకు వచ్చి చాలాదినములైనది- మీయష్టదిగ్గజములను జయించి జయపత్రముల నందుకొను తలంపుతో నచ్చటికి వచ్చియున్నాఁడు కావున వెంటనే సభచేయించి గెలిచినచో జయపత్రము నొసంగి పంపివేయుఁడు. ఓడినచో దేవవారి చిత్తమునకుం దోఁచిన పరిహారములఁగైకొని పంపించివేయుఁడు.

ఇట్లు భవన్మిత్రుఁడు,
వీరభూపాల దేవప్రతాపరాయలు.

అది విని శ్రీకృష్ణదేవరాయలు, "మేధావిభట్టను పండితుఁడు వచ్చియున్నవాఁడట అతఁడు మన కగపడలేదే? ఏమి యీ యాశ్చర్యమని సభవారి నడిగెను. ముక్కుతిమ్మన్న లేచి నిలువంబడి రామకృష్ణునిచే నా పండితుఁడు పరాభూతుఁడై పట్టణమువిడిచి పారిపోయెనని, జరిగిన యంశములన్నియు, రాయలకు విన్నవించి రామకృష్ణునియొక్క చమత్కారము మేధావిభట్టంత గొప్పపండితుని భయపెట్టి పాఱఁదోలఁగలిగెనని విన్నవించెను. రాయలు రామకృష్ణునియొక్క యుక్తికి మిగుల నానందించి రామకృష్ణునకు రత్నాల హారము బహుమాన మొసంగి, తిరువనంతపురమునుండి వచ్చిన వార్తాహరుని సబహుమానముగాఁ బంపించివైచెను.

---

## —: అల్లసాని పెద్దన్నగారి నాక్షేపించుట :—

శ్రీకృష్ణదేవరాయలొకనాఁడు విద్వత్కవు లందఱితోను కొలువుదీర్చి యుండఁగా రామకృష్ణుఁడు లేచి నిలువంబడి, భక్తిరసమునందు నాతో సమానముగాఁ గవితచెప్పగలవారీ సభయందే కాక యీ ప్రపంచమునందు సైతము లేరని నుడివెను. రాయలది విని, యట్టి కవిత చెప్పిచూపింపవలయుం గాని, యూరక డంబములు పలికినచో నేమిలాభమని యనెను. అందఱికన్న నెక్కుడుఁగా గవిత చెప్పిచూపించెద నిదో వినుండని రామకృష్ణుఁడీ క్రింది పద్యముం జదివెను.

ఆ. వె. లచ్చిమగఁడ నీకు • లక్ష నమస్కృతుల్
సీతమగఁడ నీకు • సేవఁజేతు
సత్యభామమగఁడ • సన్నుతించెదనిన్ను
మిత్రవిందమగఁడ • మేలొసంగు

లక్షణకుమగండ • లాలింపరానన్ను
నీలమగండనాకు • నీవెదిక్కు
జాంబవతికిమగడ • జలంబుసేయక
యెల్లిమగండనన్ను • నేలికొనర.

ఇదియా! భక్తిరసప్రధానమైన కవిత్వమని యందఱును నవ్వసాగి అంతట రామకృష్ణుఁడు, "ప్రపంచమునందు భార్యకంటె నిష్టము యిన పదార్థము వేఱొండు లేదుకదా! అందువలననే మన యల్లసాని పెద్దన్న దేవరవారిని సంబోధించుచు.

క. శ్రీ వేంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ! చిన్నమదేవీ
జీవితనాయక! కవితా
ప్రావీణ్యఫణీశ! కృష్ణరాయ మహేశా.

అని తన మనుచరిత్రమునందు వ్రాసిచ్చినాఁడు, అందువలననే నా దేవరవారి కమితానందము కలిగెను! "చిన్నమదేవీ జీవితనాయక!" అనుటలో నెంత సారస్యమున్నదో దేవరవారికే యెఱుకపడవలయుం గాని, యితరులకు శక్యమగునా? "చిన్నమదేవీ జీవితనాయక" యనినప్పుడు దేవరవారే యమితానందము జెందఁగా నల్లిమగండనని చెప్పుకొన్నప్పుడంతకంటెను నేను బ్రహ్మానందముం జెందియుండఁగా, సత్యభామమగఁడా! యనినప్పుడు శ్రీకృష్ణపరమాత్మునకుఁ గలుగు సంతోషమునకుగల పారము దేవరవారెఱుంగవలెను. మనపెద్దన్న యెఱుంగవలెను. తదుపరి నే నెఱుంగవలయుం గాని, యీ సభవారి కేమి తెలియంగలదని సమాధానముం జెప్పెను. సభాసదులందఱును పెద్దన్నగారి నాక్షేపించుటకై రామకృష్ణుఁడింత యుక్తి జేసెనని లో లోన నవ్వుకొనసాగిరి.

—: రా జ శి వి :—

రాయలొకప్పుడు సభయందుఁ గూర్చుండి, "మా సామంతు లందఱును మిగుల రాజశివిగలవారు సుమండీ! అందువలననే వారిం జూచినప్పుడు నా కమితానందము కలుగుచుండును" అని నుడివెను. అందుపై రామకృష్ణుఁడు లేచి, "అబ్బో! నేను మాత్రమో! ముందుగా నా మాటం జెప్పి యితరులం జెప్పవలయుంగాని లేనివో నేనొప్పుకొందునా? రాజశివియందు నాకంం జాలినవారు కలరా? నే నెప్పుడును, గురుగుకూర, చెంచలికూర, తుమ్మికూర, లేతగిరిసకూర, చింతకూర వీనినన్నిటిని పొరంటినూనియలతో భక్షించుచుందును. అరిగయున్నమనిన నాకపారసంతోషము. లేఁగదూడతోడలునాకినచో నామేనికిహాయిగానుండును. మేఁకొకనృగుఁపటివెట్టుకొని, నులకమంచముపై కీవిగాఁ బన్నుండెదను. అందువలన నే నే యందఱికన్న నెక్కువ రాజశివిగలవాఁడనగుదును అనియెను. రాయలదివిని, "రామకృష్ణా! నీ మాటలు కడుంగడు విచిత్రముగా నున్నవే! రాజశివికివి యా లక్షణములు?" అని యడుగఁగా, రామకృష్ణుఁడు "దేవా! రాజశివిలక్షణము లెట్టివియో విష్ణుచిత్తీయమునందు దేవరవారేవుడివి యున్నారుకదా! జ్ఞాపకములేదా! లేకున్నచో జ్ఞాపకమొనర్చెదను. వినుండని విష్ణుచిత్తీయములోని యీ క్రిందిపద్యముం జదివెను.

మ. గుమగుంజెంచలి, తుమ్మి, లేదఁగిరిసాకుం దింత్రిణీ పల్లవో,
త్కరముంగూడఁ పొరంటినూనియలతోఁ గట్టావికట్టారి గో
గిరముల్మెక్కి, తమింబపులొప్పులముపోఁ గ్రొవ్వుల్మోయిన్నాక, మేఁ
కొకునృగ్ గుంపటి మంచమెక్కరి; ప్రభుత్వైకాప్తి రెడ్డజ్జడిక్.

ఆ సమాధానమునకు రాయలు రామకృష్ణునికంటె సమయోక్తిపరుఁడెవ్వఁడు లేఁడనియు, యుక్తిచేసి యాక్షేపించుటలో నెవ్వగు నీతనికిఁ విద్యాకౌశల్యముం బరీక్షించి మమ్ముగల నీ వైదునుండి విడిపించిన

జాలరనియు, మిక్కిలి మెచ్చుకొని రామకృష్ణుఁడే హాస్యరస ప్రపం[illegible]డని సహర్షముగా వాక్రుచ్చెను. రామకృష్ణుఁడు రాయలయంతటి వానినే యాక్షేపింపఁగా నితరుల నాక్షేపించుట యాతనికొక లెక్కయా యని యనుకొనిరి.

---

—: దొంగలచేఁ బూలమొక్కలకు నీరుఁదోఁడించుట :—

ఒకనాఁడు శ్రీకృష్ణ దేవరాయలు ఖైదీలం జూడవలయునని బయలుదేరి కారాగారమునొద్దకుం బోయెను. ఖైదీలందఱును రాయలంజూచి, తమ్మాచెరనుండి విడిపింపుఁడని మ్రొక్కుకొనుచుండిరి. తామేమియు నేర మొనరింపకుండఁగనే యక్రమముగాఁ జెరలోనుంపఁబడితిమని రాయలతోఁ గొందఱు మొఱలెట్టుకొనుచుండిరి. గజదొంగలని పేరొందిన యిద్దఱు దొంగలు, రాయలంజూచి "దేవా! మేము గజదొంగలము! దొంగతనమునందు మమ్ములను మించినవాఁడీ జగత్తునందు లేఁడు కాఁబట్టి దేవరవారు మా చౌర్య విద్యాకౌశల్యముం బరీక్షించి మమ్ముల నీ ఖైదునుండి విడిపించిన యెడల మేము దేవరవారి సైన్యమునం జేరి దొంగతనము జేయుట మానివైచి దేశోపకారమునకై పాటుపడెదము. దేవరవారికి మా ప్రాణములను త్రికరణశుద్ధిగా నర్పించెదము. అంతియే కాని యింతటి నుండి మాస్వలాభమునకై యెట్టిదుష్కృత్యముసం జేయము. మాకుబుద్ధివచ్చినది. కరుణించి మమ్ము చెరనుండి విముక్తులంజేయుఁ"డనియు తమ్ము రాయల సైన్యమునం జేర్చుకొనుఁడనియుఁ బ్రార్థించిరి ఆ మాటలనువిని, రాయలు "ఓరీ! మీరు దొంగతనములో నెంతగట్టివారో పరీక్షించినంగాని యే మాటయుం జెప్పఁజాలము. ఈ రాత్రి మిమ్ములను కారాగారమునుండి విడిపించెదము. తెనాలి రామకృష్ణుఁడు యింటికేగి, యెద్దియేని బంగారు నగ నొక్కదానిని దొంగిలించి తె

చ్చినచో, మీ కోరిక నెరవేర్చెదనని నుడివి వారల నా రాత్రికి ఖైదు నుండి విడుదలచేయవలసినదిగా నాజ్ఞాపించి వెడలిపోయెను. రాయల యాజ్ఞ ప్రకార మా దొంగలను సాయంకాలమయినతోడనే విడిచి పెట్టివైచిరి. ఆ దొంగలిరువురును జీఁకటి పడినతోడనే బయలుదేరి రామకృష్ణుని దొడ్డియందుఁ బ్రవేశించి, కాఁకరపాదుక్రిందఁ గూర్చుండి దాఁగియుండిరి. రామకృష్ణుఁడు రాత్రి భోజనమునకై లేచి, పాద ప్రక్షాళనము నిమిత్తము దొడ్డిలోనికివచ్చి, కాఁకరపాదుక్రింద దొంగలుండుటం గనిపెట్టి, చూడనివాఁడుబోలె నింటిలోనికరిగి, తన భార్యతో "ఓసీ! నేఁడీ పట్టణమునకు దొంగలు మెండుగా వచ్చియున్నవారు. మన ధనమును సొమ్ములునుం గడు జాగరూకతతో దాఁచికొనవలయును. కానున్నచో ప్రమాదము రాఁగలదు నీ బంగారునగలన్నియును. సిటుదెమ్ము, వాని నీ యంగవస్త్రమున మూటఁగట్టి నూతిలో, బడవైచెదను. తెల్లవారినపిమ్మట మరల దీసికొనవచ్చు" ననియెను. అందులకు సమ్మతించి యామె తన నగలన్నియుం దీసి యాతనికిచ్చెను. ఆ నగలను రామకృష్ణుఁడు తన పుస్తకములపెట్టెలో జాగరూకతతో దాఁచియుంచి యచ్చటనున్న రుబ్బురోటి పొత్రమునకుఁ బదిలముగాఁ దన యంగవస్త్రముం జుట్టబెట్టి వడివడిగా నూతిచెంతకేగి, యా మూటను గుభాలున నూతిలోఁ బడవైచెను. దొంగలది చూచి, విస్తారముగా శ్రమపడనక్కఱలేకయే తమకానగలన్నియుఁ జిక్కఁగలవని లోలోన సంతోషించుచు నూరంతయు మాటుమణఁగు పర్యంతముఁ బాదుక్రింద నణఁగిమణఁగియుండిరి. రామకృష్ణుఁడింటియందు గొంత సేపటివఱకును బన్నుండి, భార్య నిద్రించిన పిమ్మట లేచి, యటకమీఁదికెక్కి, వెలిసెలోనుండి మెల్లగా దొడ్డిలోనికి సవ్వడికాకుండ దగి యొక మల్లెపొద మాటునకుం బోయి యచట డాఁగియుండెను. ఊరందఱు నీ పాటికి నిద్రపోదురను తలంపు

గలిగినతోడనే దొంగలులేచివచ్చి నూతిచెంత నిలువంబడిరి. నూయి నిర్మలముగా నుండెను. నీరుదోడుటకై కట్టియుంచిన యేతము గడను గట్టిగాఁ బట్టుకొని, మెల్లమెల్లగా నొకఁడు నూతిలోనికిం దిగి నగలమూటను వెదుక నారంభించెను. రెండవవాఁడు నూతిమీదఁ కెక్కి నిలువంబండి, నగలమూఁటను త్వరగఁదీసి యందిమ్మనెను. నూతిలోనివాఁడు నగలమూఁటకొఱకై నలుదెసలును, వెదకుచుండెను నూతియందు నీరు విస్తారముగా నున్నది. నగలమూఁట యేవైపున నున్నదో కానుపించుటలేదు కాఁబట్టి నూతిలోనున్నవాఁడు పైనున్నవానితో నోరీ! నూతియందు నీరమితముగా నున్నది. కొంతనీరుఁదోడివైచినం గాని నగలమూట కాన్పించునట్లు లేదనెను. అట్లయినచో నీరు దోడివైచెదమని వాండ్రిద్దఱును నీరుతోడుట కారంభించిరి. నూతిలోనున్నవాఁ డేతపుబుఱ్ఱను ముంచుచుండెను. నూతిలోనున్నవాఁడు పైనున్నవానితో నోరీ! చప్పుడేమియుఁ గాకుండఁగా నీరు పాఱవంచి వేయవలయుం జుమీ! యని హెచ్చరించెను. ఇట్లివ్వారి పనిని వారు చేయుచుండిరి. ఎంతతోడినను నూతిలోని నీరు తఱుగుట లేదు. అప్పుడు రామకృష్ణుఁడు లేచి యొక పాఱం జేఁబూని యా దొంగలు తోడిన నీటిని తన పూలమొక్కలకుఁ గట్టుకొనుచుండెను. తొలికోడి కూసినది నీరేమియుం దఱుగలేదు. పూలమొక్కలన్నియు జాలవఱకును దడిసిపోయినవి. కాని యొకటి రెండు చెట్లుమాత్రము మిగిలియున్నవి. నీరుదోడుటకు దొంగలకుఁ బ్రాణములు విసిగిపోయినవి. చివరకు నూతిలోనివాఁడు నూయియంతయుఁ గలయవెదకి యా పాత్రపుమూటను బయటికిఁదీసి పట్టుకొని పైకెక్కివచ్చెను. వారిద్దఱు నా మూటను విప్పి చూచునప్పటి కందు రుబ్బురోటి పొత్రముగ పడెను. రామకృష్ణుఁడు మనలను మోసముఁజేసెను. పోవుదముగా

రా! యని మొదటివాఁడు రెండవవానితో ననెను. అప్పుడు రామకృష్ణుఁడు వెడలిపో నుద్యుక్తులైయున్న దొంగలంజూచి, నాయనలాఁరా! మీ ధర్మమా యని కూలి యిచ్చుకోనక్కఱలేకుండఁగా నా పూలచెట్లన్నియుఁ దడిసినవి. ఇంక రెండు పాదులుమాత్రము మిగిలిపోయినవి. అవిరెండును తడియుపర్యంతము నీరుతోడి మాఁటదక్కించుకొని మఱిపొండు బాబూ! మీ కెంతయైనఁ బుణ్యముండునని పెద్దయెలుంగునఁ గేకవైచి చెప్పెను. ఆ కేకవిని యిరుగుపొరుగు వారందఱును లేచిరి దొంగలు పాఱిపోవుటకుఁ ద్రోవఁగానక, యిటునటు నడయాడసాగిరి. వెంటనే తలారివచ్చి యా దొంగలం బట్టుకొని కారాగారమునం బెట్టి బంధించివైచిరి.

## —: ధూర్జటికవి :—

కృష్ణదేవరాయలువారికి ధూర్జటికవిపై నెక్కుడుప్రీతి. విభూతిపిండికట్లును రుద్రాక్షతావళములును ధరించి యాతఁడెప్పుడును శుద్ధశ్రోత్రియుఁడుగా నగపడుచుండువాఁడు. రాయలు సభలోఁ గూర్చుండినపుడెల్ల ధూర్జటికవియొక్క కవితామాధుర్యమునం గూర్చియే తఱుచుగాఁ బ్రశంసించుచుండును. పైకెంతశ్రోత్రియుఁడుగా నగపడినను నీతని యంతరాత్మమాత్ర మంత శ్రోత్రియమైనది కాదు. ఈతనికి వేశ్యాంగనా సంపర్కము మెండు. గుడియల కామియను వేశ్యతో నెల్లప్పుడును ధూర్జటికవి సంచరించుచుండెను. గ్రామమునకుం గ్రొత్తగా నే వేశ్య వచ్చినను ధూర్జటిని సందర్శించి మఱీ పోవుచుండును. ఇంతటి పండితుఁడయ్యును నింతటి మహాకవియయ్యును ధూర్జటి వారాంగనాలోలుఁడై దుర్వ్యసనవర్తనుఁడై యున్నాఁడని రాయలకెఱింగించి, మందలింపఁ జేయవలయునని, తక్కిన కవులందఱకు నుద్దేశ్యము కలదు, గాని, తగిన సమయము దొరకమిచే నెప్పటికప్పుడే

రాయలకుం జెప్పుట కనువుపడదయ్యెను. ధూర్జటికి నానాటికి వేశ్యాంగనా లోలత్వ మభివృద్ధి యగుచుండెను ఇదియంతయుం గవి, కెల్లల రామభద్రుడను సార్థకనామముగల యయ్యలరాజు రామభద్రుఁ డొకనాఁడు రామకృష్ణునిం గలసికొని, మన ధూర్జటి వారాంగనాలోలుఁడై సొమ్మంతయు నమ్ముచేయుచున్నాఁడు. మనము మన్నించిన మానువాఁడుగా నగపడుటలేదు. ఆతఁడొక్కనాఁడు వెచ్చించిన ధనము నావంటివానికైనచో, బిడ్డలును, మేము సుఖముగా నొక సంవత్సరము జీవించుటకుఁ జాలియుండును. రాయలు విద్యా వివేకవేదియేకాని, కుటుంబ వివేకవేది కానందున ధూర్జటియొక్క వక్రగమన మెఱుంగకపోవుటచేతను నిట్టి యవినీతి కెడమగుచున్నది. కాఁబట్టి నీ వెట్లయినం దెంపుఁజేసి, రాయలకీ సంగతి నుద్బోధించి, మందలింపఁజేయుమని చెప్పెను. ఈ దినముననే నేనా పని నొనర్చెదనని రామకృష్ణుఁ డాతనితో ననెను. నాఁడు రాయలు కొలువుండు సమయమునఁ గందఱు నాస్థానమునకేగిరి. అంతట రాయలు ధూర్జటిం జూచి, యభివందన పూర్వకముగా

చ. "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేల కల్గెనో
యతులిత మాధురీమహిమ" యని యభివాదన మొనర్చెను.

అంతట రామకృష్ణుఁడు లేచి యా పద్యము తరువాయి నిట్లు నాక్షేపణపూర్వకముగాఁ బూరించెను.

"హా తెలిసెన్ భువనైక మోహనో
ద్ధత సుకుమార వారవనితా జనతా ఘన తాపహారి, సం
తత మధురాధరోదిత సుధారసధారలఁ గ్రోలగాఁజుమీ."

వేశ్యాంగనాధరోష్ఠ పానముచేతనే ధూర్జటికవిత్వమున కింతటిమాధుర్యము కలిగెనని, చెప్పుటచే ధూర్జటి వేశ్యాంగనా లోలుఁడని యందఱకును వెల్లడియయ్యెను. ధూర్జటి యేమియు ననఁజాలక తలవంచుకొని సిగ్గుపడి యూఱకుండెను. తరువాత రాయలొకప్పుడు రహస్యముగాఁ ధూర్జటిని మందలించెను.

---

## —• కవిగండపెండేరము •—

సంస్కృతాంధ్రములయం దసమానముగాఁ గవిత సెప్పఁగల వారికి, గండపెండేర మొసంగుదమని, శ్రీకృష్ణరాయలు సెలవీయఁగా అల్లసాని పెద్దన్న యీ క్రింది పద్యముం జెప్పెను.

ఉ. పూతఁ మెఱుంగులున్ బసరుపూఁప బెడంగులుఁ జూపునట్టివా
కైతలు? జగ్గునిగ్గు నెనఁగావలెఁ గమ్మనఁ గమ్మనన్ వలెన్
రాతిరియున్ బవల్మఱపురాని హొయల్చెలి యా రంజపు ని
ద్దాతరి తీఁపులం బలెను దారసిలన్ వలెలోఁదలంచినన్;
బాతిఁగ పైకొనన్వలెను పైఁదలికుత్తుకలోని పల్లటీ
కూఁతలనన్ వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్
జేతికోలదిఁ గౌఁగిటనుఁ జేర్చినఁ గన్నియచిన్ని పొన్నిమేల్
మూఁతలచన్నుఁదోయివలె ముచ్చటఁగావలెఁ బట్టిచూచినన్
డాతొడనున్న మిన్నులమిటారపు ముద్దులగుమ్మ కమ్మనా
వాతెఱ దొండపండువలె వాచవిగావలెఁ బంటనూనదిన్
గాఁతలఁదమ్మిచూలి దొరకైవసపుంజవరాలి సిబ్బెపున్
మే తెలియబ్బురంపు జిగినిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బ పొం
బూతలనున్న కాయ సరిపోఁడిమికిన్నర మెట్లబంతి, సం
గాతపు సన్నబంతి, బయకారపుఁగన్నడ గౌళవంతుకా
సాతత తానతానల పసందిపుటాడెడు గోటమీటుబల్
మోఁతలునుంబలున్ హరువు మొల్లముగావరు నచ్చ తెన్గుఁ
రీతిగ సంస్కృతంబు బచరించెడుపట్టున భారతీ వధూ
టీ తపనీయ గర్భనికటీ భవదానన పర్వసాహితీ
ఘాతిక నాటకప్రకర భారతభారత సమ్మతప్రభా
శీత నగాత్మజా గిరిశశేఖర శీతమయూఖ రేఖికా

పాతసుధాప్రపూర బహుభంగ ఘుమంఘుమ ఘుంఘుమార్భ్రి
జాతకదాళయుగ్మలయసంతి చుంచు విపంచికామృదం
గాతక తేహితత్తహితహాధిత దంధణుదాణుదింధిమి
వ్రాతనయానుకూల పదవారకుహూద్వహ హారికింకిణీ
నూతన ఘుల్లులాచరణ నూపురఝూళఝుళీమరంద సం
ఘాతవియద్ధునీ చకచకద్వికచోత్పల సారసంగ్రహా
యాతకుమార గంధవహ హారిసుగంధ విలాసయుక్తమై
చేతముఁజల్లఁజేయవలెఁ జిల్లున, జల్లవలుర్ మనోహర
ద్యోతకగోస్తనీ ఫలమధుద్రవ గోఘృత పాయస ప్రసా
రాతి రసప్రసార రుచిరప్రతిమంబుగసారె సారెకున్.

ఇట్లు చెప్పిన పద్యమునకు రాయలు సంతసించి యాతనికిఁ గవి గండపెండేరము నొసంగెను. అది రాయలు తనకు స్వయముగాఁ గాలికిఁ దొడిగినదగుటచే నా గండపెండేరముం జూచుకొనునప్పుడెల్ల ను పెద్దన్న మిక్కిలి మురియుచుండువాఁడు. కాలియందలి గండపెం డేరమాతని కంటఁబడునా; ప్రపంచమునంతయు నాతఁడు మఱచి పోవుచుండెను. అట్టి సమయమున నెవరేమాట వచియించినను నాత నికి వినపించకుండునంతటి సంతోషమాతనికిఁ గల్గుచుండెను. ఒకనాఁ డు పెద్దన్న తనయింటం గూర్చుండి, శిష్యులకు పాఠములం జెప్పుచుం డెను కాలు కదపినపుడెల్లను గండపెండేరము ఖంగుఖంగున మ్రోగు చుండెను. ఆ శబ్దమునందుఁ బెద్దన్న యంతరంగము విలీనమైపోయెను. అప్పుడాతనికి సంతోషము వెల్లివిరిసిపోవుచుండెను అప్పుడు పెద్దన్న తన శిష్యులం జూచి,

చ. "వదలకమ్రోయునాంధ్రకవి వామపదంబున హేమనూపురం
బుదితమరాళకంఠ నిననోద్ధతినేమని పల్కుపల్కెరా!"

అని సగర్వముగాఁ బల్కెను. అదివిని శిష్యులందఱు నా పద్యమును జక్కఁగాఁ బూరింపవలెనని యాలోచించుకొనుచుండిరి. అసమయము ననే రామకృష్ణుఁడా దారిం బోవుచు, మాటిమాటికిని పెద్దన్నచే ను డువఁబడుచున్న యా సగముపద్యమును విని నాక్షేపణ పూర్వకము గాఁ దక్కిన సగముపద్యము నిట్లు బూరించెను.

"గుడియలకామినున్ననగు కోమలకంధర భాగ్యరేఖ నీ
నుదుటను లేదులేదనుచు నూఱు తెఱంగుల నొక్కిపల్కెరా."

అదివిని పెద్దన్న యేమనుటకుం దోపక యప్పటికూరకుండెను.



—: ముక్కు తిమ్మన్న :—

రాయలొకప్పుడు భట్టుమూర్తిం జూచి, స్త్రీ వర్ణనముం జేయు నపుడు, నాసికమును జక్కఁగా వర్ణించిన కవీశ్వరులెచ్చటను గానం బడుటలేదు. నీవట్టి వర్ణనము నొకపద్యమునందిమిడ్చి రచింపఁ గలవా యని యడిగెను. అందుపై భట్టుమూర్తి యీ క్రింది పద్యముం జదివెను.

శా. నానా సూనవితాన వాసనల నానందించు సారంగమే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకం దపంబంది యో
షా నాసాకృతిఁబూని సర్వసుమనస్సౌరభ్య సంవాసమై
పూనెం బ్రేంతఁణమాలికా మధుకరీపుంజంబు లిర్వంకలన్.

అదివిని, రాయలును, సభాసదులును, పరమానంద భరితులై యట్టి వర్ణనముం గావించిన మహాకవి యెచ్చటనుఁ లేడు. మిక్కిలి యింపుగానున్నది యందఱైక్యకంఠముగాననిరి. రాయలు భట్టుమూ ర్తింజూచి "నీవింత మహాకవివని యింతకాలమున్నుండినను నెఱుంగనై తిని ఇంత సొబగుగా, నింత లాలిత్యముగా, నింత యుక్తముగా, నింత మాధుర్యముగా, నింత యౌచిత్యముగాఁ బద్యముం జెప్పఁజాలిన

కవి నెచ్చటను నేఁజూడలేదు. ఈ పద్యము ప్రత్యేకముగా నాలుగువేల దీనారములవెలచేయఁగలదు. ఇచ్చెదను, పుచ్చుకొమ్మని వెంటనే రాయలు భట్టుమూర్తికి నాల్గువేల దీనారములొసంగెను, (దీనారమనఁగా నొక నాణెము, కృష్ణదేవరాయల కాలమున నివియే వాడుచుండిరి. ఒక దీనారము పదునాల్గు వరహాల వెలగలది) అప్పుడు రామకృష్ణుఁడు లేచి, రాయలతో! "అయ్యా! దేవరవారిపద్యమునకు సరియైనవెలయే కట్టినారు. వెల సరిగానిశ్చయించుటలో దేవరవారికంగల బుద్ధివిశేషము మఱి యెవ్వరికిని గలుగఁబోదు. ఈనాల్గువేలును మన భట్టుమూర్తి పద్యముంగొన్న యసలువెలయే! ఈతనికి పద్యమునందు లాభమేమయిన నుండినఁగాని యీతనికిఁ గిట్టంపుకాదు. కాఁబట్టి రహస్యవిద్యావేదులగు రాయలువారీతనికి లాభమెయయిన నొసంగి మఱిపద్యముం గ్రహింతురుగాక యని దేవరవారికవిన్నవించు కొనుచున్నాఁడ ననెను. రాయలదివిని "ఏమీ! ఈపద్యమీతఁడు రచించినది కాదా! అట్లయినచో మఱెవ్వరు రచించిరి!" అని యడుగఁగా రామకృష్ణుఁడు "మన నంది తిమ్మన్న యీపద్యమును రచించి తనపారిజాతపహరణమునందు వేసికొన నెంచుచుండగా, నాతనియొద్ద మన భట్టుమూర్తి నాలువేల దీనారములిచ్చి యీపద్యముం గొనెను. దేవరవారు మరొక్కవేయి దీనారములు లాభమొసంగినచో సమంజసముగానుండును డా యని మనవియొనర్చికొనినాఁడను" అనెను. అది విని యందరును నవ్విరి రామకృష్ణుడు తన రహస్యమును బయటపెట్టినందులకై భట్టుమూర్తి కాతనిపై గోపముకలిగెను. సమయముచిక్కినప్పుడు రామకృష్ణునిఁ జిన్నబుచ్చవలయునని భట్టుమూర్తి తఱి వేచియుండెను.

ఒకనాడు నందితిమ్మన్న తనయింటియందు ముయ్యాలమంచము పయిం బండుకొని యూఁగుచుశిష్యులకుఁ బాఠములను జెప్పుచుండెను. ఆసమయమున రామకృష్ణుడచ్చటి కేతెంచి, ముక్కు తిమ్మ

న్నంజూచి, "తాతా ! ఊతునా ? యనెను. తిమ్మన్న, ఇంతకంటె నున్నదిరా బాబూ ! అట్లనే కానిమ్మనిచెప్పెను. అందుపై రామకృష్ణుఁడు కాండ్రించి తుబుక్కుమని యాతనిమోముపై నుమిసెను. అంతటఁ దిమ్మన్న కాగ్రహముకలిగి యాతని దౌడలపైఁదన్నెను. ఆ తాఁపుచే రామకృష్ణుని కోఱ పన్నొకటి విరిగి నేలపై రాలెను. పెద్దవాడగు తిమ్మన్న యట్లొనరించినందుకు రామకృష్ణుడు కోపించుకొనక, తనయింటికేగి, దుప్పికొమ్ము నొకదానిని దెచ్చి, చక్కఁగాఁ జెక్కి పల్లుగా నమర్చికొని, మరునాఁడు రాయల యాస్థానమున కేగెను. రాయలు ప్రసంగవశమునఁ గవీశ్వరులం జూచి, "రవికాననిచోఁ గవి గాంచునేకదా" యని సమస్య నిచ్చెనట ; అంతట భట్టుమూర్తిలేచి రామకృష్ణునకు తొలిదినమున జరిగిన పరాభవముం దెలియఁజేసి తన కోపముం దీర్చికొనుట కిదియే సమయమని యెంచి యా సమస్య నిట్లు పూరించెను.

ఉ. ఆరవి వీరభద్ర చరణాహతి డుల్లిన బోసినోటికిన్
నేరడు ! రామలింగకవి నేరిచెఁ బో మరి ముక్కుతిమ్మన
క్రూరపదాహతిం దెగిన కొక్కెఱపంటికి దుప్పికొమ్ము ప
ల్లారచియించెనౌర ! రవిగాననిచోఁ గవిగాంచునేకదా.

అని రచించి రామకృష్ణుఁడు ముక్కు తిమన్నగారిచేఁ దన్నులుతిన్నాడని సూచించెను. రాయలా సంగతి యేమని యడుగఁగా భట్టుమూర్తి రాయల కా యుదంతము నంతయు నెరింగించెను. రామకృష్ణుడెప్పుడును నెద్దియో కొంటెపనియే చేయుచుండెనని సభవారందఱును నవ్వుకొనిరి,



—: నూరుమంది పేద బ్రాహ్మణులకు వస్త్రదానము లిప్పించుట :—

రాయలవారి యనుంగుభార్యయగు సన్నపూర్ణాదేవి (ఈమెం పేరే చిన్నమదేవియనియుం జెప్పుదురు.) యొకప్పుడు లక్షవత్తుల వ్రతముం జేసికొనుచుండెను. బ్రాహ్మణులకు మంచి సమారాధనములు గావింపబడుననియు, మంచిమంచి దానములు చేయఁబడుననియు, బ్రతీతి చుట్టుప్రక్కల నంతటను వ్యాపించెను. పొరుగూండ్లనుండి సుమారు నూరుమంది పేద బ్రాహ్మణులు వచ్చియుండిరి. వారందఱును గుచేలుని జ్ఞాపకముఁ జేయునంతటి జీర్ణవస్త్రములను ధరించి యుండిరి. ఈ వ్రతమునం దేయే దానము లెవరెవరి కీయఁబడవలయునో యీ విషయమిదివఱకే నిశ్చయింపబడి యుండుటచే వీరికి వస్త్రదానము లీయఁబడునను నమ్మకములేకుండెను. రామకృష్ణుఁడీయపర కుచేలుర నూర్వురంజూచి, చాలనక్కటికపడి, తనమనస్సునందు వాపోయెను. వీరందఱకును వస్త్రదానములం జేయుమని రాయలవారితోఁ దానెంతచెప్పినను తన మాట యీ విషయమునందుఁ జెల్లదని యాతఁడెఱుంగును. ఎట్లయిన వీరికి వస్త్రము లిప్పించుటకై యుక్తింబన్నవలెనని యాలోచించుచుండెను. కొంతసేపట్లాలోచించి, గుభాలునలేచి, యా నూర్వురుపాఱులుఁ గూర్చున్నచోటికేగి, యడావిడిగాఁ దనయుత్తరీయముం దీసి దాని చెఱంగొకింత చింపివైచి కాపీనముగా ధరియించుకొని, తక్కిన తన వస్త్రములరెండింటిని, చిన్నచిన్న ముక్కలుగాఁజింపి, వత్తులుచేయుట కారంభించెను. అది చూచి యా పాఱులందఱును రామకృష్ణుని యొద్దకేతెంచి, "ఇదియేమి ? ఇంత యడావిడిగా ధరించిన వస్త్రములు సైతముఁ జించివైచి వత్తులుచేయుచున్నా" వని యడిగిరి. రామకృష్ణుఁ డప్పుడు వారితో నిట్లు పలికెను. వ్రతమునకు వత్తులు తక్కువవచ్చె

ను. అందుచే రాయలు వత్తులుచేసి యిచ్చినవారికి వత్తియొకటి కొక దీనారముచొప్పున నొసంగెదరు. కాబట్టి యెన్నివత్తులు జేసియిచ్చిన నన్ని దీనారములు రాఁగలవు. ఒక ముహూర్తకాలములో వత్తులందియ్యవలెను. లేకున్నచోఁ గార్యము మిగిలిపోవునట. అందులకే యింత యడావిడిగా వత్తులు చేయుచున్నానని చెప్పెను. మీరును త్వరలో వత్తులుచేసి యొసంగినచోఁ జాల దీనారములు సంపాదించుకొనఁగలరని చెప్పెను. అందుపై నాపేదబ్రాహ్మణులందఱును బేరాసచే గాపీనములం ధరించి, తమతమ వస్త్రములను ముక్కలు ముక్కలుఁగా జింపివైచిరి. కొంతసేపటికి వ్రతము పూర్తియయ్యెను. రాయలవా రెవ రెవరి కేయే దానము లీయబడవలయునో యా యా దానములు వారికిప్పించి, తక్కన చిల్లర పేద బ్రాహ్మణులకు వోడ్డి సంభావనము లిప్పించుటకై వచ్చెను. అప్పుడచ్చటనున్న యా బ్రాహ్మణులందఱును గోఁచిబాఁతరాయులై యుండుట రాయలుచూచి "ఇదియేమి! మీరు ధరించు వస్త్రములేమయ్యె" నని యడుగఁగా, నా బ్రాహ్మణులు "దేవా! దేవరవారి వ్రతమునకు వత్తులు తక్కువయినవటకాదా! అందులకై మావస్త్రములన్నియుఁ జించివైచి వత్తులు చేసివైచినారము. వత్తికొక్కొక్క దీనారముచొప్పున నిచ్చెదమని దేవరవారు వాకుఁచ్చిరి. ఇదిగో! వత్తులు! వీనిం దీసికొని లెక్కప్రకారము మాకు రావలసిన ధనము మాకొసంగివేయుడు" అని యావిప్రులనిరి. "వత్తికొక్క దీనారముచొప్పున నిచ్చెదమని మీతో నెవ్వరనిరి? వత్తులు మాకు దక్కువైనవని యెవ్వరనిరి? ఇది యసంభవమని :రాయలనెను. అందు కావిప్రులు, "దేవా! అల్లదిగో ఆమూలఁ గూర్చున్నయాతడు మాకీ విషయముం దెల్పెను. లేకుండినచోఁ గట్టుకొనుటకు వస్త్రమైనను లేకుండఁ జేసికొని వత్తులు చేసివైచుటకంత తెలివిహీనులమా" యని చెప్పుచు

రామకృష్ణుని రాయలకుం జూపిరి. రాయలు రామకృష్ణునిం దిలకించి, యీతడే యీకొంటెతనముం గావించెనని తెలిసికొని, నిష్కారణముగా నీవిప్రుల బట్టలన్నియు రామకృష్ణుఁడు చింపించినదినందుకు మనంబునఁ జాల నొచ్చుకొని, దినమునకు నూరుతప్పుల కనుజ్ఞనిచ్చినవాఁడగుటచే రామకృష్ణు నేమియు ననఁజాలక, యా పేదపాఱులందఱకును, మంచి మంచి, వస్త్రయుగ్మములం దెప్పించి, యొక్కొక్కని కొక్కొక్కజత వస్త్రములచొప్పున నిప్పించి, యొక్కొక్కనికి వేయి దీనారములచొప్పున దానములంగూడ నిప్పించెను. విప్రులందఱును సంతోషించుచు రామకృష్ణునివలననే మనకీ దానములు దొరకెనని తమలోఁదాము ననుకొనుచుం బోయిరి. సభాసదులు రామకృష్ణుని యుక్తికి మెచ్చుకొనిరి.



—: విష్ణుచిత్తీయ విమర్శనము. :—

శ్రీకృష్ణదేవరాయలొకప్పుడు కవులనందఱంజూచి, తాను రచించిన విష్ణుచిత్తీయమను గావ్యమును జక్కఁగా విమర్శించి, యందలి గుణాగుణములను దెల్పుఁడని కోరెను. అందులకు రామకృష్ణుఁడు లేచి, "విమర్శించుట కేమియున్నది? ఏగుడ్డులేమ భోజనముఁజేసెపోరా" యనినట్లున్నదనెను. "నీవెప్పుడును నిట్లడ్డదిడ్డముగానే పల్కుచుందువు! అందలి గుణాగుణముల నేర్పరింపవలసినదనిగాని, యిట్టి యసందర్భపు మాటలాడమంటినా?" యని రాయలనఁగా, రామకృష్ణుఁడు సందర్భపు వాక్యములో యసందర్భపువాక్యములో యోజించుటకు దేవరవారే యర్హులుగాని, నావంటివాని కవి చెల్లునా? అసందర్భపు వాక్యము లిట్టివని మచ్చు చూపించుటకే కాఁబోలును! దేవరవారు తమ విష్ణుచిత్తీయములో

శా. "అనిష్టానిధి గేహసీమనడురే యాలించిరర్ మోవియున్నం
తేనాగేంద్రిశయానుపుణ్యకథలుం; దివ్య బ్రిబంధాను సం
ధాన ధ్వానము; నాస్తిశాకబహుతా; నాస్త్యుష్ణతా; నాస్త్యపూ
పో; నాస్త్యోదనసౌష్టవంచ; కృపయాభోక్తవ్యమస్వల్పకార్"

అని వాకుృచ్చినాఁడు, "చాలాకూరలులేవు. వేడిగాలేవు. పిండివంటలులేవు అన్నము బాగుగాలేదు, దయచేసి భోజనము చెయ్యండీ! బాబూ!" అనఁగా నిఁక వాఁడు తినునదేమి? వాని మొగము! దీనియర్థము విచారింపగాఁ "నే నిష్టములేదు. భోజనముచేసి పొండని కాదా! ఇప్పుడు దేవరవారీ యసందర్భపువాక్యము లెవ్వరివో నిర్ణయింపనర్హులు. ఇట్టి యపూర్వరచనా పాగల్భ్యముగల దేవరవారే, సందర్భమెట్టిదో యసందర్భమెట్టిదో; యెఱుంగ సమర్థులును కాని నా యట్టివానికేమి తెలియగలదు? అని సమాధానముం జెప్పెను. రామకృష్ణుని సమయోక్తిక రాయలెంతయును మెచ్చుకొని యెంతటివానినైన నాక్షేపణమొనర్చుట రామకృష్ణునికే తగునని నుడివిరి. రాయలయొద్ద దినమునకు నూరుతప్పుల కనుజ్ఞవడసి యున్నందున రామకృష్ణుఁడిట్టి కొంటెపలుకులు పలుకుటకు సాహసించెనని కవులందఱును నవ్వుకొనిరి.



—: నృసింహదేవర నృసింహకవి :—

రాయలయాస్థానమున కొకప్పుడు నరసింహదేవర నృసింహకవియనునాతఁడు వచ్చి "దేవా! మీ యష్టదిగ్గజములను జయింప వచ్చితిని. నాకు జయపత్రిమొసంగెదరా? లేక మీ కవీశ్వరులతో వాదించుట కనుజ్ఞనిచ్చెదరా? ఏమి సెల" వని యడిగెను. రాయలు పండితులవంకఁ దిలకించి చూచెను. పండితులందఱును దలలు వంచుకొని యూరకుండిరి. రామకృష్ణుఁడు లేచి, మీకెందుం బ్రివేశము కలదని నరసింహకవినడిగెను." నేను బాగుగాఁ గవిత్వముఁ జెప్పగలను. వారితలో నాయంతటివాఁడు వేఱొకడులేఁడు. ఎట్టి యపశ్బ

మునకైనను వ్యుత్పత్త్యర్థముం జెప్పి, సుశబ్దముగాఁ జేయఁగలను, ఎంతటి గూఢార్థమునైనను విడఁదీసి చెప్పఁగలను" అని నరసింహకవి ప్రత్యుత్తరమొసంగెను. అట్లయినచో నేఁ జెప్పినపద్యమును వ్రాయగలవా యని రామకృష్ణుఁడాతని నడిగెను. ఒక్క నిమిషములో వ్రాయఁగలనని యాతఁడు బదులు చెప్పెను. రామకృష్ణుఁడట్లయినచో వ్రాయుమని యీ క్రిందిపద్యముం జెప్పెను.

క. త్రువ్వట బాబా! తలపైఁ
బువ్వట జాబిల్లి! వల్వబూచట! చేదే
బ్రువ్వటఁ జూడఁగ సుళువు
క్కవ్వటయరయంగ నట్టి హరునకుఁ జేజే.

అని చెప్పఁగా నా యుచ్చారమున కక్షరములు లేమిం జేసి, నరసింహకవి వ్రాయలేకపోయెను. రామకృష్ణుఁడు "సరే! అయినదా! యిక్కడికి నీ వ్రాఁతలోని కౌశ్యలము, ఇఁకఁ దక్కిన విషయములెట్లున్నవో కనుగొందము" అని యీ క్రిది పద్యముం జదివెను.

మ. కనసీహారగు పద్మపత్రధళరంగత్కీర్తి! చాణూరమ
ర్ధన శుక్రాక్షి కళేభరాణ్మృగపతీ త్రైలోక్య ధామోదరా!
యనఘా శంకర పాదపద్మయుగ దివ్యాస్తోకపాణీ! జనా
ర్ధనవాహిప్రియ! వైరివిగ్రహముకుంధా! మిత్రవింధాధిపా!

అదివిని నరసింహకవి "యీ పద్యమునం దపస్వరములు మెండుగానున్నవనియు, నిట్టి శబ్దోచ్చారము నేను వినలేదనియు చెప్పుచుఁ జెవులు మూసికొనెను. అంతట రామకృష్ణుఁడు ఇట్టి దైవభక్తి ప్రాధాన్యమగు మంచిపద్యము నీ పాపిష్ఠిచెవులం బడదు. కనుకనే నీ విట్లు చెవులు మూసికొన్నావు! ఇందపశబ్దమేమియు లేదు. దీనికి టీకఁ జెప్పుచున్నాఁడను వినుమని యిట్లు చెప్పెను.

కనక్=మాఁడఁగా, నీహార=మంచువంటి, గు=ప్రకాశించుచున్నట్టిని, పద్మపత్ర=తామరరేకులవలె, ధళ=తెల్లనైన, రంగత్=ఒప్పుచున్నట్టిన్ని, కీర్తి=యశస్సుకలవాఁడా! చాణూరమత్=చాణూరమంతటుఁ

డనువానిని, హన=చంపినవాఁడా! శుకాక్షికళ=తెల్లనైన కన్నులుగల (తేజస్సుతోఁగూడిన కన్నులుగల, కాళిందుఁడను పేరుగల సర్పమనునట్టి) ఇభరాట్=ఏనుఁగు రాజునకు, మృగపతీ=సింహము వంటివాఁడా! త్రైలోక్య=మూఁడులోకములయొక్క, ధామ=నివాసమైన, ఉదరా!=పొట్టగలవాఁడా! శంకరపాదపద్మయుగ దివ్యాస్తోకపాణీ!=ఈశ్వరుని పాదపద్మముల నారాధించుచున్న దివ్యమైన హస్తముగలవాఁడ! యనఁగా=అని చెప్పగాఁ, జన=జనులయొక్క, అర్థ=కోటికలను, నవా=నూతనములైన హి=హితములను, ప్రద=యిచ్చువాఁడా! వైరి విగ్రహ=శత్రువులయొక్క కూడికను, ముకుంథా=పోఁగొట్టువాడా! అధిపా=ఓ ప్రభువా! మిలౌ=మృత్యువును, రవింధా=ఆజ్ఞాపింపుమా ఓ శ్రీకృష్ణా నీవు మంచి యశస్సుగలవాఁడవని చెప్పి స్తోత్రముఁ జేయువారియొక్క హితములను కోరి మృత్యువును దూరముగా తోలివైచెదవని భావము. (ప్రశ్న) వైవార మొనర్చు పద్యమునకు నీవు చెవులు మూసికొంటివి వైఁగా జయపత్రములు కావలెననుచున్నావా?

చ. తెలియనివన్ని తప్పులని దట్టతనావ సభాస్థలంబునను
బలుకఁగరాకురోరి పలుమారుఁ బిశాచపు పాడగట్టి! నీ
పలికిననోట దుమ్ముపడ! భావ్యమెఱుంగక పెద్దలైన వా
రల నిరసింతు రా! వినుమురా! నరసా! విరసా! తుసా! భుసా!

చ. ఒకని కవిత్వమందెనయు నొప్పులు! నా కవిత్వమం
దొకనికిఁదప్పఁబట్టఁ బనియుండదు; కాదని తప్పఁబట్టినన్
మొగమటు క్రిందుగాఁదిగిచి మొక్కలువాసిన యంపకత్తితో
సిక మొదలంటఁగోతుమటి చెప్పనఁగొట్టుదు మోముఁదన్నుదున్

మొట్టమొదటనే జయపత్రములం గోరక రాయల నాశ్రయించినచో నీకిచ్చుట మంచిసత్కారము జరిగియుండును కాని, యిప్పుడెట్టి సత్కారమును నీకుఁజేయఁబడదు, రాయలవారు మిగుల దయాళువులగుటచే. నీపదార్థములం దీసికొనక యిచ్చటనుండి మర్యాదగా వెడలిపో నిచ్చుచున్నారు. పో! పొమ్మని మందలించెను. నరసింహకవి యచ్చ

ఁనుండి యూరక వెడలిపోయి మహాగర్వముతో నున్నవాఁడగుట నే నే రాజును సంకర్షింపక నిర్లక్ష్యముతో నుండెను. తానప్పుడప్పుడు రచించిన పద్యముల నమ్ముకొనుచు, నందువలన వచ్చిన ధనముచేఁ గుటుంబపోషణముఁ జేసికొనుచుండెను. ఒకనాఁడు రాయలు తన యంతఃపురమందుఁ గూర్చుండియుండి తన గారంబు కూఁతురగు తిరుమలాంబతోఁ జతురంగమాడుచుండెను. అందొక బంటు రెండేనుఁగులమధ్య నిఱికికొని పోవుటఁజూచి తిరుమలాంబ "యుద్ధతుల మధ్యమునఁ జేరకుండఁదరమె" యని చదువుచు నాబంటును పైకెగఁద్రోసెను. రాయలా గీతపాదమును విని పద్యమును పూర్తిగా చదువమనియెను. అందుపైఁ దిరుమలాంబ,

తే. గీ. ఒత్తుకొని వచ్చు కటికుచో • ద్వృత్తిఁ జూచి
తరుణి తనుమధ్యమెచటకో • తలఁగిపోయె
నుండెనేనియు నగపడ • కున్నె యహహా?
యుద్ధతులమధ్యమునఁ జేర • కుండఁదరమె.

అని చదివెను. ఈపద్యమెక్కడిదని రాయలు తిరుమలాంబనడుగఁగా నిదియొక దీనారమిచ్చికొంటినని యామె బదులుచెప్పెను. రాయలు, నీవిపద్యమునకు సరియైన వెల నీయలేదు. ఇదివేయి దీనారములకుం దక్కువ జేయదు. ఆంధ్రభోజుఁడను బిరుదువహించిన కృష్ణరాయని కుమార్తె యేపద్యమునకుం దగిన వెల యీయలేదని నన్నుడితరులమాట లెక్కయేమని లోకులు మనలను నిందింతురు. కావున నీవీ పద్యమేకవివద్దఁ గొంటివో యాకవికిఁ దక్కిన తొమ్మిదివందలతొంబదితొమ్మిది దీనారముల నిచ్చివేయుమని చెప్పి, కొలువుకూటమునకు వచ్చెను. తరువాత దిరుమలాంబ నరసింహకవిం బిలిపించి, రాయలయాజ్ఞాప్రకార మాధనమాతనికిచ్చి, సత్కరించి, రా

యలకొక చీటివ్రాసి నరసింహకవిని రాయలయొద్దకు సభలోని కంపించెను. సభయందు రామకృష్ణుడు లేకున్నచో, నచ్చటికేగ దను కాని రామకృష్ణు డచ్చటనున్నచో నచ్చటికిఁ బోజాల నని యాతడనెను. ఆసంగతి రాయలు విని, మూఁడుదినముల వఱకును రామకృష్ణుడు సభకు రాకుండునట్లుత్తరువుచేసెను. ఆనాఁడు నరసింహ కవి హరిశ్చంద్ర నలోపాఖ్యానమను ద్వ్యర్థికావ్యమును రచించి, రాయలకంకితమునీయవచ్చెను. అప్పుడు రామకృష్ణుడుప్పరవానివేష ము వైచుకొని, యొకతట్టను మట్టితో నెత్తిపయింబెట్టుకొని, యుప్పరి వాండ్రతోఁగలసి కోటలోనికింబోయెను. నరసింహకవి తనహరిశ్చంద్ర నలోపాఖ్యానమును రాయలకు వినుపించుచు, "నారచించు హరిశ్చం ద్ర నలోపాఖ్యానమునకుం గథావిధానంబెట్టిదనిన "యని చదువగా నుప్పరివేషముతోనున్న రామకృష్ణుడులేచి "ఆదేటి బాబూ! గొడా నికిఁ బేరెట్టునప్పుడు తోలెముపేరు మొదటచు, వొద్దెపేరుతరువాతను పెట్టాలంట కాదుబాబూ! ఆలాగునతిరుగమాఱు చేసినావేమి?" యనె ను. నీవననదియేమిరా? సరిగాఁజెప్పు" మనవుడు "నల అచ్చందో పాక్కాన"మనా లంటకాదా బాబూ! అరిశ్చందనలోపాక్కానమేమిటి? మాగురువు లోళ్ళుపెప్పినారులెండి! అందుకోసము సెప్పచున్నాను బాబూ! మఱేమిలేదు." అనగా ముక్కుతిమ్మన్నగారు లేచి, ఓరి రామకృష్ణా! నీవెంత కొంటివాడవురా! ఉప్పరవాని వేషముం ధరించి సభకువచ్చితివా? యని యాతనితలపైనున్న తలపాగందీసివైచి నీటితో మొగముంగడిగి, రామకృష్ణుడనియాతని నందఱకుఁదెలుపుచుచేసెను. అప్పుడు రామకృష్ణునిజూచి యందఱును నవ్వుకొనిరి. రామకృష్ణు డు సభవారిం జూచి. నేనులేకుండ మీరందఱును గ్రంథకాలక్షేప ముం జేయవలయుననుకొన్నారా? అట్లని నేనువచ్చుట మానెదనను కొన్నారా ? నాతో వివాదముఁ బెట్టుకొనినప్పుడెట్టివానినైన నీడ్చి

చేసెదను కాని, స్నేహముగా నన్ను యెడల దూషించెదననుకొంటిరా యని చెప్పి నరసింహకవి నభినందించి, నీవు మంచి కవీశ్వరుడవు. నీకవిత్వమునందు స్వారస్యము మెండు కాని యీకావ్యమునకు పొరపడి హరిశ్చంద్రనలోపాఖ్యానమని పేరుపెట్టితివి. నల హరిశ్చంద్రోపాఖ్యానమనిన నుచ్చరించుటకు సౌలభ్యముగా నుండును కదా! ఇంక నీ కావ్యమును వినుపింపుము. నేనడ్డు వచ్చువాఁడంగానని యాతని సంశయమును దూర్చివైచెను. నరసింహకవి సాంతముగాఁ దన కావ్యమును వినుపించెను. రాయలాతనికి మంచి బహుమానములిచ్చి సత్కరించెను.



## —: బడబానలభట్టు :—

ఒకనాడు రాయల యాస్థానమునకుఁ దిట్టుకవిత్వమునందారితేఱిన బడబానలభట్టను నాతఁడు వచ్చెను. రాయలీతనిఁ దిట్టువాని యని యెఱింగినవాఁడగుటచే నాతని వెంటనే పంపించివేయవలయునను నుద్దేశ్యముతోఁ, గొంతధనమిచ్చి, యాతని సత్కరించి, యీదినమునకుఁ గొలువు చాలింతమనియెను. అప్పుడు బడబానలభట్టు రాయలంజూచి,

ఉ. బూతుకవిత్వనైఖరుల • పోడిమిజూడక పొమ్మనంగ నీ
కేతగుఁగాక, యిట్టులు మ • ఱెవ్వరు సెప్పుదురో నృపోత్తమా!
చాతురితోఁ దెనాలికవి • సత్తముడీతడు రామకృష్ణుడీ
రీతిని యూరకుండిన వి • రించిని నైనజయింపఁజాలనే?.

అని నుడివెను. అప్పుడు రామకృష్ణుడులేచి, రాయల సెలవులేకని యింతవఱకు నూరకుంటిని. కాని, ఏది! అట్లయినచో నీపద్యము

బూరింపుమని యీ సమస్యం జదివెను. "చూతుమెలవుడా యటంచు సూక్తులు వలికెక్" బడబానలభట్టు యన్యదేశశబ్దములను సాధించుట యెట్లో యెఱుంగజాలక యూరకుండెను. రాయలది గ్రహించి, యీతఁడు నీ వొసంగిన సమస్యను బూరింపలేకపోయెను. కాఁబట్టి యీ సమస్యను నీవే పూరింపవలయు నోయి రామకృష్ణా యనగానే రామకృష్ణుడీ క్రిందివిధమున నా సమస్యం బూరించెను.

కం "అతురపడి యెదరించితి
వాతతబలశాలి రాముఁ • డని తనయునితో
సీత ; రఘురాము సదృశునిఁ
జూతుమె లవుడా యటంచు • సూక్తులువలికెక్."

అప్పుడు బడబానభట్టు రామకృష్ణుంజూచి మెచ్చుకొనుచు.

చ. అర్ణవవేష్టితాఖిల మ • హామహిమండలమందు బూతులర్
బూర్ణుడు రామకృష్ణకవిఁ • బోలుకవీశ్వరుఁ డొండుగల్గునే
నిర్ణయమెంచి చేయుమహ • నీయగుణాఢ్యుఁడు బూతుమందిగా
దుర్ణయుడైనచోఁ దవిరి • ధూర్తతమంచిన బూతుఁజేసెడుక్.

అని కొనియాడెను.



—: అ న్న పూ ర్ణా దే వి :—

శ్రీకృష్ణదేవరాయ లొకనాఁ డంతఃపురమందిరోద్యానము నందలి యొక తటాకమునం దన్నపూర్ణాదేవితోఁ గేళీవిలాసముగా జలక్రీడలాడుచుండెను. రాయల యర్ధాంగలక్ష్మియగు నన్నపూర్ణా దేవికి జలక్రీడయనిన మిగుల నిష్టము. అందుచే రాయలామెను సంతృప్తిపరచుటకై యామె మొగముపై నీరూరక వెదజల్లుచుండెను.

ఆమెయును రాయలమోమునపై నుదకముం బోయుచుండెను ఇట్లాం డొరులును బీటువోనితమకములతో, జలంబు వోసికొనుచుండుతతి, సన్నపూర్ణాదేవికి శ్రమమధికమయ్యెను. అప్పుడామె యింకఁ దనపై జలముంబోయవలదని చెప్పఁదలంచి సంస్కృత భాషలో “ హేరాజన్ మాంమోదకైస్తాడయ”అనియెను. ఆమాటలకు రాయలు, దేవి తనకు మినపసున్నియుండలు కావలెనని కోరుచున్నదని యర్థము జేసికొనియెను.

హే రాజన్=ఓ రాజా, మాం=నన్ను, మోదకైః=మోదకములచేత, (మినుపసున్నియుండలచేత) తాడయ=సంతృప్తి పరపుము (కొట్టుము)

అంత రాయలొక యంతఃపుర పరిచారికం బిలిచి, సున్నియుండలు దెమ్మని యాజ్ఞాపించెను. పరిచారిక సున్నియుండలం దెచ్చి యిచ్చెను. “ఇవిగో ! సున్నియుండలు ! వీనిం దీసికొనిభక్షింపు”మని సంస్కృత భాషలో సన్నపూర్ణదేవితో ననెను. “నాకు సున్నియుండలు దినుట కిదియాసమయము! కావలసినచో దేవరవారేభక్షింపు” డని యామె రాయలకుఁ బ్రత్యుత్తరమిచ్చెను “ఇంతకుముందేకదా! నీవుసున్నియుండలు కావలెనంటివి! ఇప్పుడేల యక్కఱలేదనుచున్నావని” రాయలామె నడిగెను. ”నేనింతకుముందెప్పుడును సున్నియుండలు తెమ్మనలేద”ని యామెబదులుచెప్పెను. ఇంతకుముందు నీవుపల్కిన సంస్కృతవాక్యమున కర్థమేమి? ఉండలు కావలయునని కాదా?” యని రాయలడిగెను ”అట్టియర్థమిచ్చునట్టి యేవాక్యము నే నంటినో సెలవిం”డని యామె యనెను, “హే రాజన్!మాంమోదకైస్తాడయ యని పలికితి”వని రాయలు బదులుచెప్పెను. “ఔను నేనా యభిప్రాయముతో నామాట ననలేను. అ మాటయందట్టి

యర్థముండిన నుండునేమోకాని, మీరు నాపై విస్తారముగా నుదకో ముం బోయుచుండినందున, నూపిరి యాడక, శ్రమచెంది, హే రా జన్ =ఓ రాజ! మాం=నన్ను, ఉదకై:=నీటిచేత, మాతాడయ=కొట్టవద్దు (నీరు విస్తారముగా పోయవద్దు) అనెడు భావముతో నే నా వాక్యమునంటి"నని యన్నపూర్ణాదేవిబదులుచెప్పెను. ఈ మాటలు వినినవెంటనే రాయల కామెయం దపోహముకలిగెను, ఆమెతన్ను మోసముచేసినదని రాయలనుకొనియెను. మాటయందే భర్తను మోసముచేసిన స్త్రీ క్రియలయందు మోసము,జేయజాలకుండునా? యని యాతఁడు భావించెను. ఆ భావనాలతాంకురము శాఖోపశాఖ లుగా నల్లుకొని, యాతని మానసక్షేత్రముసంతయు నాక్రమించివైచెను. ఇకఁనామెతోఁ గాపురముఁ జేయుటకు రాయలకు మనస్సొ ప్పకుండెను. వెంటనే రాయలామెను విడిచివచ్చి, యొకమాలతీని కుంజముకడఁ గూర్చుండెను. అచ్చటనున్నప్పుడాతనికి మనోభావ ములెన్నెన్నియో యుత్పన్నములయ్యెను. ఆతని మానసమున కన్న పూర్ణాదేవి పరమవిరోధినిగా నుండెను. రాయల కన్నపూర్ణాదేవి యందలి యనురాగమంతయు నొక్కపెట్టున వీడిపోయెను. రాయ లన్నపూర్ణాదేవిని సంపూర్ణముగా బరిత్యజించివైచెను. రాయలు స్కంధావారమునకేగి భుజించి, తనయేకాంతశయ్యపైఁ బన్నుండెను. నాటినుండియు రాయలు సరిగాసభకువచ్చుట మానివైచెను. పండిత గోష్టియేలేకుండ నొకరీతినిగాలక్షేపమొనరించుచుండెను, రాయలకుఁ దనపైఁ బరిపూర్ణముగా నాగ్రహము కలిగినదని యన్నపూర్ణాదేవి గ్రహించెను. ఆమె యేమిచేయుటకునుం దోచక యాహారవిహారా దులమానివైచి, చింతాకులస్వాంతయై పరితపించుచుండెను. తనతో నరణముగావచ్చిన కవియగు ముక్కుతిమ్మన్నగారి కీయుదంతమును తనకాప్తురాలగు దాసిచే వర్తమానమంపి తెలియఁబఱచెను. నంది

తిమ్మన్న యీవిపత్తు మాన్పించుటకై తగిన యుపాయమూరయుచుం డెను. అన్నపూర్ణాదేవిపై రాయలకాగ్రహము కలిగి, రాయలామెను బరిత్యజించెనన్నవార్త కర్ణాకర్ణికగానూరందఱకును తెలిసిపోయెను. మహాపతివ్రతయు సుగుణవంతురాలునగు నన్నపూర్ణాదేవి కేయిట్టియిక్కట్టు సంభవించినదని పట్టణమునం దాబాలగోపాలము ను విచారింపదొడఁగిరి. రాయలొకరు చెప్పిన వినువాఁడా? ముక్కు తిమ్మన్న పారిజాతాపహరణమును రచించి రాయలకు జదివి వినుపించెను. పారిజాతాపహరణములోని! "ఆ జగన్నాటక సూత్రధారి శిరమచ్చోవామపాదంబునన్ దలఁగందోచె లతాంగి? యట్లయగుఁ గాంతల్ గోపముం జెందినన్" అను వాక్యమును విని మఱింత యాగ్రహాయ క్రుద్ధుడయ్యెను. "స్త్రీ లూరకయే చంలస్వభావులు! కోపముగలిగినచో శ్రీకృష్ణుని యంతటివాఁడే తనకు భర్తయైనను వాని నెడమ పాదముతో శిరస్సుపైఁ దన్నెదరట! ఔరా! ఎంత యాగడము!" రాయులకిట్టి సంకటముం దీర్చుటకు రామకృష్ణుఁడొక్కఁడు దక్క మఱియెవ్వరిచేతను గాదను వదంతి పట్టణమంతటను వ్యాపించెను. అష్టదిగ్గజములను కవులందఱునువచ్చి, రామకృష్ణునిం బ్రోత్సాహపరచిరి. రామకృష్ణుఁడొకనాడు రాయలయొద్దకేగి యీక్రిందిశ్లోకములంజదివెను.

శ్లో॥ చరన్వనాంతే నవమంజరీషు। నషట్పదోగంథ ఫలీమజిఘ్రిత్।

సాకిం నరమ్యా సచకింనరంతా।బలీయసీ కేవలమీశ్వరాజ్ఞా॥

తా. అన్నిపుష్పముల సౌరభ్యముల నంగీకరించు తుమ్మెద సంపంగి పుష్పముపై వ్రాలకపోయినంత మాత్రమున సంపంగిసౌరభ్యమునం దీసిపోవునదియుఁగాదు. తుమ్మెద పుష్పముల సౌరభ్యముల నెఱుంగనదియుఁగాదు. బలవత్తరమైన యీశ్వరాజ్ఞ వలన నట్లు జరుగుచుండెనే గాని వేరొండుగాదు, అని తాత్పర్యము

శ్లో॥ మాకింశుక ప్రకటయద్య నిమేషమాత్రం
మన్మస్తకే విహరతీతి మధువ్రతోయమ్
కింమాలతీ విరహవేదనయా త్వదీయం
దృష్ట్వాప్రసూనమచిరా ధనలభ్రమేణ.

తా. ఓ మోదుగ పుష్పమా! తుమ్మెద నీపై వ్రాలినదని గర్వపడకుము. తుమ్మెద తనకు మాలతీ పుష్పము ప్రాప్తించనందున విరహమోర్వఁ జాలకయగ్నిలోఁబడి ప్రాణత్యాగముఁ జేసికొనవలయునని యెంచి, యెఱ్ఱగా నగపడుచున్న నిన్నుంజూచి, యగ్నియని భావించి, నీలోఁబడినచో దహించుకొని పోవుదుఁ గదా యను భ్రాంతిచేనీపై వ్రాలినదే కాని వేరొకటికాదని భావము.

శ్లో॥ భ్రమర భ్రమతాదిగంతరాళే ।
క్వచిదాస్వాదితమీక్షితంశ్రుతంవా
వదసత్యమపాస్యపక్షపాతం ।
యది జాతీకుసుమానుకారిపుష్పమ్.

తా. ఓతుమ్మెదా! నీవన్నిదిక్కులయందును సంచరించుచు నన్నిపుష్పములపై వ్రాలుచున్నావుకదా! జాజిపువ్వువంటి పువ్వు నెచ్చటనైనను వినియున్నావో, చూచియున్నావో, యాస్వాదించి యున్నావో, పక్షపాతములేకుండఁగా యథార్థము వక్కాణింపుమని భావము.

శ్లో. కుసుమానిలిఖంతు నామచిత్రేకతిచిత్కారు విశేషహాథశిక్షా
సుభిత్నమమూని కంలభంతేకిముపైతేషురసంపిబంతిభృంగాః.

తా. చిత్రకారకులు పువ్వులను లిఖించుచున్నారు కానివానికి సువాసన తెచ్చిపెట్టఁగలరా? ఆలిఖించినపువ్వులమీఁదఁ దుమ్మెదలు, వ్రాలి, వానిరసము నాస్వాదించునా? యని భావము.

V. Sri Ramamma —



శ్లో॥ కింమాలతీంమ్లాయసిమాం విహాయ !
చుచుంబ తుంభీకుసుమం షడంఘ్రిః ।
లోకేచతుర్భిశ్చరణైః పశుస్స్యా ।
త్వషడ్భిరత్ర పశుర్నకింస్స్యాత్.

తా. ఓతుమ్మెదా ; మాలతీపుష్పము నైన నన్ను వాడిపోవు నట్టుగాఁ జేసి, తుమ్మపుష్పముపై వ్రాలి యాస్వాదించుచుంటి వేమి ! లోకమునందు నాల్గుకాళ్లుగల జంతువు పశువనిపించుకొనుచున్నది. కాని నీకారు కాళ్ళుండుటవలనఁ బశువువే గాకుండఁగాఁ బశువున్నర గాఁగూడఁ గానిపించుచున్నావే! అని భావము.

ఈశ్లైదుశ్లోకములయందు, రాయలు తుమ్మెదవంటివాఁడని యు, నన్నపూర్ణాదేవి, జాజి, మాలతి, మొదలగు పుష్పముల సౌర భ్యమువంటిసుగుణసంపత్తి కలదనియు, నట్టిసుగుణసంపదగల యన్న పూర్ణాదేవిని, తెలివి తక్కువవాఁడై రాయలు పరిత్యజించెననియు, నిదియాతని దోషముకాదనియు, విధికృతమనియు, రాయలును నన్న పూర్ణాదేవియును సమానమయిన సుగుణసంపదలు గలవారనియు, నొండొరుల నెడఁబాయుట నీతికాదనియు, మొదలగు ధ్వనులుకలవు.

ఇట్లు రామకృష్ణుఁడు చదివినతోడనే విద్వాంసుఁడగు రాయ లా యర్థముం గ్రహించి, తనమానసమునందలి మాలిన్యముం బోఁ గొట్టుకొని, యన్నపూర్ణాదేవిం దిరుగఁ బరిగ్రహించి, యామెతోఁ గలసిమెలసి సుఖముగనుండెను. ఈశ్లోకము లైదును నన్నపూర్ణా దేవియే రచించినదని కొందఱి యభిప్రాయమైయున్నది. కాని యీయ మె రచించిన యితరగ్రంథములేనియు లభింపకుండుట చేతను, నిట్టిభావ ములు పాండురంగ మహాత్మ్యమునందుఁ బెక్కులు కాన్పించుచుండు టచేతను, రుక్కాపంచకమని చెప్పంబడు నీశ్లోకములైదును గవితా స్వామ్యముంబట్టి రామకృష్ణుఁడేరచించెనని నిర్ధారణముగాకమానదు.



వారము దినములలో భారతమును రచించి సుల్తానుగారికిఁ గృతి నిచ్చుట.

భామినీ రాజ్యమును "అల్లాయుద్దీన్ గంగో బహామనీ" యను నాతఁడు స్థాపించెను. ఆ రాజ్యమునకు విజాపురము రాజధాని. శ్రీకృష్ణరాయలు రాజ్యమేలు కాలమునాటి "కేదులశాహి" యను నాతఁడు విజాపురమును బరిపాలించుచుండెను. ఈ "యేదులశాహి" కుతుబశాహికి మునిమనుమఁడు. "కుతుబశాహి" నాదిండ్ల యప్పామాత్యునిచే దశకుమార చరిత్రోపాఖ్యానమను ప్రబంధమును రచింపంజేసి, కృతి నందెను. "కుతుబశాహి!" కాలమునుండియు నీవంశపు సుల్తానులు కృతులఁ బొందుట కుత్సాహముగలవారై యుండిరి. ఆంధ్రకవుల నాదరించుచుండిరి. విద్యానగర రాజ్యమునకును విజాపుర రాజ్యమునకును రాయచూరు సరిహద్దుగా నుండెను. తుంగభద్రానది సరిహద్దుగా నుండవలెనని తురుష్కులును, విజాపురమే సరిహద్దుగా నుండవలెనని హిందువులును, పెక్కుసారులు జగడములాడుచుండిరి. ఈ రెండు రాజ్యములవారికిని సరిహద్దులనుగురించిన తగాయిదాలను క్రమముగా హరిహర బుక్కరాయుల కాలమునుండియు, వచ్చుచుండెను. విజాపుర రాజ్యమెప్పటికైనను విజయనగర రాజ్యమునం గలుపుకొనవలయునని సాళువనరసింహరాయుల కాలమునుండియు నాలోచనలు జరుగుచునే యుండెను. కాని యది సిద్ధింపదయ్యెను. రాయలొకప్పుడు విజాపురముపై దాడివెడలి, యేదులశాహి నోడించి వైచెను. రాయల సైన్యములోని కొంతమంది యేదులశాహి యోడిపోవుటకుముందే యాతని కింజిక్కి యాతనిచే విజాపురమునఁ జెరయందుంచబడిరి. ఆ కారణముచే రాయలు గెల్చినవాఁడయ్యు నేదులశాహితో సంధిజేసికొనవలసివచ్చెను. యుద్ధవ్యయము లన్నియు నేదులశాహి రాయల కిచ్చుకొనుటకును, రెండు రాజ్యములవారికిని రాయచూరు సరిహద్దుగా

నుండుటకును, రాయచూరుదుర్గమునందు రాయలు తనసైన్యము నుంచుకొనుటకును, రాయలయొద్దనున్న యష్టదిగ్గజములను కవులు భారతమును రచించి యొకవారముదినములలో నేదులశాహికిఁ గృతినిచ్చుటకును, సంధికావింపఁబడెను. ఏదులశాహి పాండవులుగాను, వాని శత్రువగు నైజాముల్ముల్కు కౌరవులుగాను నర్థమువచ్చులాగున నా భారతము రచింపఁబడవలయునని యేదులశాహి కోరెను. అందుల కట్లనే యని రాయలంగీకరించెను. పెద్దనాది కవులందఱును మహాభారతమంత పెద్దగ్రంథము నొక వారముదినములలో రచింపఁగలుగుటయెట్లని తల్లడిల్లుచుండిరి. భారతమంతగాథ యుండవలయును. వ్యాసప్రోక్తమునకు సరిగా నుండవలయును. అన్నిపద్యములును క్రమముగా వ్రాయఁబడవలయును. పైగా "నైజాముల్ముల్కు" కౌరవులుగా నర్థమువచ్చునట్లును, "యేదులశాహి" పాండవులుగా నర్థమువచ్చునట్లును వ్రాయఁబడవలెను. భారతమనిన సామాన్యమా? పంచమవేదమని ప్రఖ్యాతిఁజెందిన మహాభారతము నొక తురుష్కున కంకితము సేయవలెననినఁ బెద్దనవంటి శిష్టాచారపరాయణుఁ డొప్పుకొనునా? ఈసంధి యనుకూలముగా లేదనియు, సంధి షరతుల నెట్లయిన మార్చుకొనవలయుననియు, మాఱుచాటు కుదురనియెడలఁ దిరుగ యుద్ధమైనను నొనర్చుటయే మేలనియు, పెద్దనాదులు రాయలకు మనవి యొనర్చిరి.

"క్రిష్టో వాడ్డే ఫిగరీడో" (Christo Vavde Figareedo) యను పోర్చుగీసు రాయబారి యీసంధి కుదిరినవెంటనే తన దేశమునకుఁ దాను వెడలిపోయినందున, మనకిప్పుడు తగిన సహాయసంపత్తి లేదనియు, దిరుగ నేదులశాహితో యుద్ధమునర్చుట విపత్తునకు హేతువనియుఁ నీయుద్ధమువలన మనకేలాభము గల్గినదనియు, ఎట్లయిన

ను శ్రీమదాంధ్ర భారతమును రచించి యేదులశాహికిఁ గృతినిచ్చుటయే సమంజసమనియు, రాజనీతివిద్యాపారంగతుఁడగు తిమ్మరుసు ఘంటా పథముగా వక్కాణించెను. "అష్టదిగ్గజములని బిరుదులువహించు టయేమి? ఏఁడుదినములలో భారతమును వ్రాయలేకపోవుటయేమి !" యని పౌరులందఱనఁజొచ్చిరి. విద్వాన్ నో విజానాతి విద్వజ్జన పరిశ్రమః। నహివంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనా" యనునట్లుకవి తసెప్పుట యందలి కష్టముఁ గవియే యెఱుంగవలయుంగాని, యితరుల కేమి తెలియును? అయ్యలరాజు రామభద్రుఁడు తనకుమారునకు వివాహముఁ జేసికొనవలయుం గనుక తనకు తీరికలేదని చెప్పి తప్పించుకొనెను. ప్రౌఢకవి మల్లన్న యందఱితోఁబాటు నేనును నడుము కట్టెదనని ప్రౌఢముగాఁ బలికెను. భట్టుమూర్తి శ్లేషకవిత్వమైనచో నన్నుం బిలువవలయుంగాని యిది నాపనిగాదని నుడివెను. ముక్కు తిమ్మన్న ముందడుగు వేయుచుండెనే కాని గమ్యస్థానము నేఁడుదినములలోఁ జేరుట దుస్తరమని తలంచుచుండెను! ధూర్జటి యేమి చేయనురాయని లోలోన జపమొనరించుచుండెను. పింగళి సూరన్న లోలోపలనే పిండుకొనుచుండెను. ఆంధ్రకవితాపితామహుఁడగు నల్లసాని పెద్దన్నగారిపైఁ గార్యభారమంతయు మోపెట్టఁబడెను. తెనాలి రామకృష్ణుఁడుమాత్రమే విచారమునులేక పరమోత్సాహ భరితుఁడై యుండెను. ఇట్లునాలుగుదినములు గతించిపోయెను. శ్రీకారమయినంజుట్టలేదు. అప్పుడు పెద్దన్న రామకృష్ణునియొద్దకేగి, "యీ యిక్కట్టు నీవలనం దీరవలయుంగాని యొరులచేఁ గాదని చెప్పి, యెట్లయినను భారతమును రచించి యేదులశాహి కంకితముఁజేయు భారము నీయది సుమా ! ఎట్లు మాటఁదక్కించుకొనెదవో? అష్టదిగ్గజములని పెద్దపేరు పెట్టుకొనియున్నాము. మనయందొకటి పుట్టినచో నది నాతలను నీతలనుఁగూడఁ బడిపోవఁగలదు ఇందుల కేమి యాలోచన

చెప్పెద"వని యడిగెను. రామకృష్ణుఁడందులకు "తాతా! ఏలయట్లు శ్రమపడియెదవు? మీరందఱూరక కూర్చుండుఁడు. ఈపని నేను సానుకూలము గావించెదనని వేయిబండ్ల తాటియాకులఁగొట్టించి, యాకులనన్నిఁటిని సంచికలుగా సిద్ధముచేయించుము. తరువాత గ్రంథము నేఁ బూర్తిగావించెదను" అని చెప్పెను. వేయిబండ్లతాటియాకులం గొట్టించిరి. ఆయాకులన్నియు గీయంబడి చక్కనిసంచికలుగా సిద్ధముచేయఁబడెను. భారతమనిన సామాన్యమా! నూరు బండ్ల గ్రంథము! గడువుదినమునకు రామకృష్ణుఁడు బండ్లం దోలించుకొని విజాపురమునకుం బోయెను. ఏదులశాహి రామకృష్ణునింజూచి 'భారతమంతయుఁ బూర్తిగా రచించితివా? అందు పాండవులు మేముగాను, మాశత్రులైన నైజాములుమల్కు కౌరవులుగాను నుండునట్లు వర్ణించితిరా" యని ప్రశ్నవైచెను. రామకృష్ణుఁడంతయు "సరిగానే సుల్తానుగారి యిష్టానుసారముగానే వ్రాసినాము. ఇదిగో! నూరుబండ్ల గ్రంథమయినది! మొదటినుండియు సర్కార్వారికిఁ జదివి వినుపించవలెను. వ్రాయుట త్వరలో ముగించితిమికాని, చదువుట కొక సంవత్సరము పట్టగలదు. కాని యొక్కసందేహముమాత్రముండిపోయినది. అదిసర్కార్నడిగి తెలిసికొనిమఱి వ్రాయవలయునని యాసంగతిమాత్ర మాపివేసినాము. సర్కార్సెలవైనచో వెంటనే యదికూడ పూర్తికావించెదము"అనెను. ఏదులశాహి "ఆసందేహమేమి? మమ్మడిగినచో మేమువెంటనే హుకుం జారీచేస్తాము" అనెను. రామకృష్ణుఁడు నసుగుచు, "సర్కార్! మఱేమియునులేదు. సర్కార్ పాండవులుగాను సర్కార్ విరోధి నైజాములుమల్కు కౌరవులుగాను వర్థము వచ్చునట్లే వ్రాసినాము. కాని పాండవులనఁగా నొక్కఁడుకాఁడు. అయిదుగురున్నారు. వారిలో యుధిష్ఠిరుఁడు యజమాని. అతనిభార్య ద్రౌపది. ఆమె కయిదుగురు మగలున్నారు. తక్కిన నలుగురు మగ

లున్న యుధిష్ఠిరుని తమ్ములే! సర్కార్ వారిని పాండవులుగా వ్రాసినాము. సర్కార్ వారిజనానావారిని ద్రౌపదిగా వ్రాసినాము. కాని సర్కార్ జనానావారికిఁ దక్కిన నలుగురు మగలుగా నెవ్వరిని వ్రాయవలయునో యది తెలియక సర్కారునడిగి తెలిసికొనిమఱి వ్రాయవలయునని యెంచి యీసంగతి మాత్రమట్టెయుంచి తక్కినగ్రంథమునంతయును బూర్తిగావించినారము. సర్కారే జనానావారికిఁ దక్కిన మగలుక్రింద నెవ్వరిని జేర్పవలయునో సెలవిచ్చినయెడల వెంటనే యదికూడ వ్రాసి ముగించివైచెదము" అనెను. ఆమాటవినునప్పటి కేదులశాహి కటకాలిమంట నెత్తికెక్కినది. అంతట నాతఁడు తోఁకఁద్రొక్కిన త్రాచువలె లేచి, "అరే! అల్లా! మాకి భారతకృతివద్దు, గీరతం కృతీవద్దు యేమీవద్దు దానికి తీసుకబోయి తగలబెట్టు అల్లా!" అనెను. వెంటనే రామకృష్ణుఁడా బండ్లమీఁది సంచికలన్నియు నొకచోట గుట్టవేయించి, తగులబెట్టించెను. అదిచూచి యేదులశాహి "మంచిపనీసేసీనావుభాయి" అని రామకృష్ణునకు బహుమానమిచ్చి యాతని సగౌరవముగాఁ బంపివైచెను. రామకృష్ణుఁడొనరించిన యీ యుక్తికిఁ బెద్దనాదికవులును, రాయలును మిగుల నానందించిరి.

—తాళ్లపాక చిన్నన్న—

రాయలొకప్పుడు కవిత్వముఁజెప్పుటకు ద్విపద మిక్కిలి యనుకూలముగా నుండుననియు, బదకవిత్వమంత పాటింపఁదగినది కాదనియు, గద్యపద్యాత్మకమగు కవిత్వమే రసవంతముగా నుండుననియుఁ జెప్పుచు రామకృష్ణునింజూచి, "యిప్పటికవులలో నెవరికవిత్వమేయే వృత్తములందు రసవంతముగానుండునో చెప్పఁగలవా" యని ప్రశ్నించెను. అందుపై రామకృష్ణుఁడు.

క. చిన్నన్న ద్విపద కెఱుఁగును
బన్నుగఁ బెదతిరుమలయ్య • పదమున కెఱుఁగున్
మిన్నంది మొఱసె నరసిం
గన్న కవిత్వంబు పద్య • గద్య శ్రేణిన్

అనివచించెను. అనఁగా దాళ్లపాక చిన్నన్న ద్విపదలు బాగుగా రచించుననియుఁ, బెదతిరుమలయ్య పదకవిత్వమునం దాఁతి తేఱినవాఁడనియు, నరసింగన్న గద్యపద్యములను బాగుగా రచింపఁగలఁడనియు భావము. తాళ్లపాక చిన్నన్న రెండుపాదములకు మ్రొక్కననియు, బెదతిరుమలయ్య యొంటికాలికే మ్రొక్కననియు, నరసింగన్న, యెగిరి జుట్టుపట్టుకొనుననియు, నింకు ధ్వనికలదు.

## భైరవభట్టు తిలకాష్ఠ మహిషబంధనము.

ఒకప్పుడు రాయలవారి యాస్థానమునకు వారణాసినుండి యొక వ్యాకరణ పండితుఁడు వచ్చియుండెను. ఈతఁడా భాష్యాంత వైయాకరణి. సామాన్యముగా వ్యాకరణముం జదివినవారు తర్క ప్రకరణములంగూడఁ జదువుచుండు నాచారము గలదు. కావున నీతఁడును దర్కశాస్త్రమునందలి కొన్ని ప్రకరణములం జదివియుండెను. ఈతఁడు తనతో ననేక పుస్తకములం దెచ్చియుండెను. ఆ పుస్తకములన్నియుఁ దర్కశాస్త్రవ్యాకరణ శాస్త్రసంబంధములైన పుస్తకములు. ఈతఁడు మిగుల డాంబికముగా నగపడుచుండెను. ఆతఁడు రాయలను సందర్శించి తాను వ్యాకరణశాస్త్ర పండితుఁడనియు, మీ యష్టదిగ్గజములతో వాదింపవచ్చితిననియు, వారిలో నెవ్వరితో నైనం గూడ వాదింపఁగలననియు, వాకుచ్చెను. కవితయేమయినం జెప్పగలవా

యని రాయలాతనిని నడిగెను. అందులకాతఁడు, "వెధవకవిత్వము! తర్క వ్యాకరణ పండితుఁడనై యుండియుఁ గవిత్వమే చెప్పలేక పోవలయునా? దేవరవారి యాజ్ఞయయినచోఁ గావలసినంత కవిత్వముఁ జెప్పగలను" అని బదులుచెప్పెను. వెధవకవిత్వమని సందులకు రాయల కాతనిపైనాగ్రహముకలిగెను. వెంటనే రామకృష్ణునకు తక్షణము రమ్మని వర్తమానమంపెను. ఒక సేవకుఁడు రామకృష్ణుని యింటికేగి, "రాయలవారి సెలవైనది. రండని" చెప్పెను. రామకృష్ణుఁడు తొందరగాలేచి యాస్థానమునకు వచ్చెను. రాయలాతనికిఁ గాశీ పండితునిఁజూపి, "యీతఁడా భాష్యాంత వైయాకరణి యట. వెధవకవిత్వము; కవిత్వమేచెప్పలేనా! యనినాఁడు. విమర్శింపుమని" నుడివెను. అప్పుడా పండితునకును రామకృష్ణునకు నీ దిగువరీతిసంభాషణము జరిగెను.

రామ—నీవు కాశీపండితుఁడవా?

పండి—అవును. మాది వారణాసియే!

రామ—నీ పేరేమి?

పండి—నా పేరు భైరవభట్టందురు.

రామ—నీ కెందెందుఁ బాండిత్యముకలదు?

భైరవ—వ్యాకరణమునందునుం దర్కమునందును.

రామ—వెధవకవిత్వము జెప్పగలవటకావా?

భైరవ—నీవు పునిస్త్రీ కవిత్వముం జెప్పెదవా యేమి?

రామ—అదికాదు. నీవన్నమాటం బట్టి యడిగితిని. కవిత్వమెన్ని విధములు?

భైరవ—కవిత్వమున కిన్నివిధములనిలెక్కయున్నదా? ఇన్నివిధము లని యెవ్వరు చెప్పఁగలరు?

రామ—అయ్యో! జడమతీ! ఇంకను సిగ్గులేక పేలుచున్నావా? "వైధవకళత్వము" అనినపుడు ముందే దిట్టున్నదా? మాటయున్నదా? వ్యాకరణముం జదివినావు కావు? పూర్వాపర సందర్భములు బాగుగా నాలోచించుకొని మఱిమాట్లాడుము.

ఈ సంభాషణమైన వెనుక రాయలు "నీ దినమునకు సభ చాలింతము. తక్కిన విషయములు రేపటిదినమునఁ జూచుకొనవచ్చును" అని సింహాసనమునుండి లేచెను. తక్కినవారందఱును లేచి, యొకరి నివాసములకు వారు పోయిరి. మఱునాఁడు రామకృష్ణుఁడు తాటియాకుల పంచిక నొకదానిం దీసికొని, దానియందేమియు లిఖింపక యుండిన సూపుకంపలను రెండింటిని దెచ్చి, గేదెకూడను గట్టిన కన్నె త్రాటితో నాకంపలను లెస్సగాఁ గట్టగట్టి, యా సంకటముంపిమిస్సి పంచికయొక్క పైభాగమునఁ బెద్దయక్షరములతోఁ "తిలకాష్ఠమహిషబంధనము" అని వ్రాసి, యా పంచికం జంకఁబెట్టుకొని, రాయల యాస్థానమున కేతెంచెను. సభాసదులందఱును కాశీపండితుని పాండిత్యమెంతవఱకుం గలదో, రామకృష్ణుని పరిజ్ఞానవిశేషమెట్టిదో, చూతమని, సభామంటపమునకు వచ్చి క్రిక్కిఱిసి కూర్చుండిరి. కాశీపండితుని కొఱకై యున్న యాసనమును, రామకృష్ణుని కొఱకై యున్న యాసనమును వేయఁబడి యుండెను. భైరవభట్టును రామకృష్ణుఁడును వచ్చి వారి వారి యాసనములపై గూర్చుండిరి. సభయంతయు నిశ్శబ్దముగా నుండెను. అప్పుడు రాయలు "నిన్నటిదినముల భైరవభట్టును రామకృష్ణుఁడు పరీక్షించినాఁడు! నేఁడు రామకృష్ణుని భైరవభట్టు పరీక్షింపవచ్చు" ననియెను. అంతట భైరవభట్టు లేచి "రామకృష్ణునితోఁ బరిసంగింతునా?" యనెను. రామకృష్ణుఁడు నా యభ్యంతరమేమియు లేదనెను. నీ చంకనున్న గ్రంథమేమని భైరవభట్టు రామకృష్ణునడిగెను. ఇది తిలకాష్ఠమహిషబంధనము! ఇంతవఱి యంత

ములను నీవు నన్నడిగి పరీక్షింపవచ్చునని రామకృష్ణుడు బదులు చెప్పెను. “తిలకాష్ఠమహిష బంధనము” ను పేరుగల గ్రంథమొక టుండునని భైరవ భట్టెన్నఁడెఱింగినవాఁడుకాఁడు. ఆ కారణముచే నీనితో వాదించుట కష్టమని యెంచి, యేదో యొకమిషచెప్పి, యు చ్చటినుండి పాఱిపోవలయునని నిశ్చయించుకొనెను. లంకెఁ గడుపు నొప్పివచ్చుచున్నది అవలకుఁ బోయి రావలయునని మిషచెప్పి యు చ్చటినుండి లేచిపోయి, యుదేపోకగాఁ బట్టణమునుండి పాఱిపోయెను. సభ్యులందరును భైరవభట్టు యింకనూ వచ్చు ననుకొను చుండిరి. ఎంతసేపయినను భైరవభట్టు రానందున రామకృష్ణునితో వాదిం పలేక యిట్టిమిషచెప్పి భైరవభట్టు పాఱిపోయినాఁడని యందఱును గ్రహించిరి. అంతట రాయలు రామకృష్ణుని యుక్తికి సంతసించి, “ఓ రామకృష్ణా! నీచెంతనున్న గ్రంథము తిలకాష్ఠ మహిషబంధ నమంటివే! ఏదీ! దానియందలి దొక పద్యము జదువుమనియెను. అప్పుడు రామకృష్ణుఁడు తిలకాష్ఠమనఁగా నూవు కంప, మహిష మనఁగా దున్నపోతు! బంధనమనఁగా గట్టిపెట్టుట మొత్తమునకు దీనియర్థ మేమనఁగా, నూవుకంపను దున్నపోతును గట్టెడు త్రాటి కేఁ గట్టుటయని యర్థము. దీనియందశ్లేషయున్నది. ఇంకను జూచుకొ నుఁడని యీ సంచిక నచ్చటఁ బడవైచి, నూవుకంపను నూవుకం పను గేదెదూఁడ కన్నెత్రాడునకు గన్నెత్రాడును, విడివిడిగాఁ జేసి చూపించెను. అందఱును రామకృష్ణుని యుక్తికిఁ గడుపుబ్బ నవ్విరి.



—:అల్లసాని పెద్దన్న:—

కృష్ణరాయలొకనాఁడు కొలువుకూటమునందుండి,

క. కలనాఁటిధనము లక్కఱ
గలనాఁటికి దాచఁ గమల ♦ గర్భునివశమా.

యని నుడివెను. తక్కిన సగముపద్యముం బూరింపవలెనని కవులందఱు నాలోచించుకొనుచుండిరి. ఏమి నుడువుటకుం దోపకుండుటచే నందఱును దమ తమ మనస్సులయందే కొట్టుకొనుచుండిరి. అప్పు డాంధ్రకవితాపితామహుఁడగు నల్లసాని పెద్దనామాత్యుఁ డీ క్రింది విధమునఁ దక్కిన సగముఁ బూరించెను.

"నెల నడిమినాఁటి వెన్నెల
యలవడునే కాదెఁబోయు ♦ నమవసనిశికిన్."

అది విని రామకృష్ణుఁడు,

క. ఎమితిని సెపితివి కపితము
భ్రమపడి వెఱిపుచ్చకాయ ♦ వడిఁదిని సెపితో
ఉమెతకయను దిని సెపితో
యమవసనిశి యన్నమాట ♦ నలసనిపెదనా!"

అని యాక్షేపించెను. అందఱును రామకృష్ణుని సూక్ష్మబుద్ధికి సంతోషించిరి. ఇం"దమవసనిశ"యని పెద్దన్న ప్రయోగించినాడు. అమావాస్యయను శబ్దముయొక్క తద్భవ "యమవస" "నిశికిన్" నిశాశబ్దము సాంస్కృతికము నిశాశబ్దమునకుఁ గిమన్ష్టింజేర్పఁగ "నిశికిన్" యైనది "అమావ్యాసనిశికిన్" యనియుండునుగాని. "యమవస" యను తద్భవ పదమును నిశాశబ్దముతోఁ జేర్పఁగూడదు. "నిశికిన్" అనికాని, "నిసకున్" అనికాని యుండినచో ననుకూలముగా నుండును. కాఁబట్టి రామకృష్ణుఁడిట్లాక్షేపణం బొనర్చెను.

—: చి న్నా దే వి :—

శ్రీకృష్ణ దేవరాయలు తన భార్య లందఱిలోఁ జిన్నమ దేవి యం దెక్కువ మక్కువతో మెలంగుచుండెను. ఎల్లప్పుడును జిన్నమ దేవియింటనేయుండును. నామెతోనే కేళివిలాసముగాఁ గాలముఁగడుపు చుండువాఁడు. రామకృష్ణుఁడొకనాఁడు రాయలనొంటిగా సందర్శించి, శ్రీకృష్ణమూర్తి తనభార్య లందఱియందును సమానానురాగముఁ జూపుచుండువాఁడు గాని పక్షపాతమెవ్వరియందుం బెట్టుకొనలేదు. దేవరవారుకూడ దక్షిణ నాయకత్వమును వహించుట సమంజసముగా నుండును. అదియునుంగాక యధికానురాగ మాగ్రహమునకుం గారణమగునని పెద్దలువచింతురు. "అతిసర్వత్రవర్జయేత్" అని నీతిశాస్త్ర వేత్తలు నుడువుదురు. కావున మనవి యొనర్చినాఁడననెను. రామకృష్ణా! నేను నా భార్యలందఱియందును సమానానురాగముతోడనే వర్తింపుచుండును. చిన్నమదేవియందుమాత్రము నాకు గొంచెమతిశయముగానే యనురాగమున్నదనుకొనుము. అందువలనం దక్కిన భార్యల కేమియు బాధలేకుండగనే సంచరించుచున్నాడనని రాయలు బదులుచెప్పెను. అధిక ప్రేమ, యాగ్రహమునకే కాక, వియోగము నకుంగూడఁ గారణమగుంజుఁడీ! యని రామకృష్ణుఁడు హెచ్చరించెను. ఆ వాక్యములు రాయలకెంతయో నద్భుతముగా నుండెను, "ఎంతమాట వచించితివి, రామకృష్ణా! చిన్నమదేవితో నాకు వియోగము కలుగునా? ప్రాణముతో వియోగము కలిగిననాఁడుగాని చిన్నమదేవితో వియోగము కలుగదని యూహింగా నమ్ముము. అని రూఢిగా వచించెను. ఈ సంభాషణ జరిగిన కొంతకాలమునకు రాయలు చిన్నమదేవి యింట నేక శయ్యయందుఁ జిన్నమదేవియుం దానును బన్నుండిరి. ఆ నాఁడు చిన్నమదేవి కిష్టమగు వంటకమేఁ

హో కావింపఁబడుటవలన నామె యెప్పటికంటెఁ గొంచెముదాత్తముగా భుజించియుండెను. అందువలన నామె కానాఁడజీర్ణము కలిగెను. కలత నిద్రయేకాని చిన్నమదేవికి సరిగా నిద్రపట్టకుండెను. ఆ కలత నిద్రలో నపానవాయువులు మెండుగా నీవలకు రాఁదొడంగెను. అంతలో రాయలకు మెలకువ వచ్చెను. రాయల కపానవాయువనినఁ బరమ యసహ్యము. అజీర్ణవ్యాధి బలవత్తరమయినందునఁ జిన్నమదేవి కమితముగా నపానవాయువులు రాఁదొడంగెను. రాయలు నిద్రనుండి లేచి, "ఛీ! ఇట్టి నీచురాలితో దాంపత్యమునర్పరాదు. ఇంత హేయమయిన స్త్రీ వేఱొకతె యీ లోకమునందుండదు. ఛీ! ఇఁక నీ జన్మమున కీమె ముఖముం జూఁడఁగూడదని వెంటనే యచ్చటినుండి లేచి వెడలిపోయెను. మఱునాఁటికిఁ జిన్నమదేవి కజీర్ణ వ్యాధి కుదిరెను. మంచి యారోగ్యము కలిగెను. రాయలేల తనకుం జెప్పకుండ రాత్రి వెడలిపోయెనో యామెకుం దెలియదయ్యెను. ఆ మఱునాఁడుగాని మూఁడవనాఁడు గాని రాయలు చిన్నమదేవియింటికి రాలేదు. దినములుగతించెను. మాసములు గతించెను. సంవత్సరములుకూడ జరిగిపోయెను. చిన్నమదేవియొక్క పేరు రాయలకు స్వప్నమందైన వినఁబడకుండెను. రాయలకింకఁ జిన్నమదేవిపై ననురాగము కుదురునా? ఎట్లు కుదురును? చిన్నమదేవి యపానవాయువులు విడుచును! కాఁబట్టి రాయల కామె యెన్నఁటికినిం బనికిరాదు. ఈ వార్త పట్టణమంతయు వ్యాపించెను. రాయల కెవ్వరు సెప్పఁగలరు? రామకృష్ణుఁడేల యుపేక్షించి యూరకుండెనని పౌరులందరు ననుకొనఁ దొడంగిరి. రామకృష్ణుఁడు, రాయలు మాటలు చెప్పినంత మాత్రమున లక్ష్యపెట్టువాడు కాఁడని యెఱుంగును. ఈ దంపతులుభయులనను సంధింపవలయునను కుతూహలముమాత్రము రామకృష్ణునకుం దీవ్రముగా నుండెను.

రామకృష్ణుఁడొకనాఁడు రాయలయొద్ద కేగి, నేను కాశీయాత్రకుం బోవలయునని యున్నది. సెలవైనచోఁ బోయి వచ్చెదను. సరే! వెళ్ళిరమ్మనిరి. రాయలు కావలసిన పరికరములును ధనమునొసంగెను. వానిం గైకొని రామకృష్ణుఁడింటికిం బోయెను. రామకృష్ణుఁడు కాశీయాత్రకుం బోయెనని పట్టణమంతయు వదంతికలిగెను. రామకృష్ణుఁడింటియందే యుండి, యొరులకంటఁ బడకుండుటకై బయటికి రాకుండ మెలఁగుచుండెను, క్షురకర్మాదికము చేయించికొనుట మానివైచెను. రామకృష్ణునకు, గడ్డమును, మీసమును, జుట్టును పెరిగిపోయినవి. ప్రచ్ఛన్నముగా నొక యగసాలిం బిలిపించి వానికిఁ గొంత ధనమిచ్చి, కొన్ని బంగారు వడ్లగింజలను జేయుమన వారముదినములగునప్పటి కా యగసాలి దోసెడు బంగారు వడ్లగింజలను తయారు చేసియిచ్చెను. కొన్ని చెంబులలో నుదకముంబోసి, యా చెంబుల మూఁతుల నతికించివైచి, యవియన్నియు నొక పెట్టియందిమిడ్చి, ఒకనాఁటి రాత్రి యా సామగ్రితో రామకృష్ణుఁడింటనుండి ప్రచ్ఛన్నముగా నూరిబయటికి వచ్చి యందొకచోట విడిసియుండెను. వేకువజామున రామకృష్ణుఁడు కాశీనుండి వచ్చినాఁడని రాయలకు వర్తమానమంపెను. రాయలు మంగళతూర్యారావములతో వచ్చి రామకృష్ణునెదుర్కొనెను. రామకృష్ణుఁడా మంగళతూర్యారావములతో బయలుదేరి, రాయలును తక్కిన మంత్రిసామంతాది వర్గములును బంధుమిత్రాది పరివారములును దన్నుఁ దోడ్కొని రా పురంబునం జొచ్చి శుభముహూర్తమునఁ దనయింటం బ్రవేశించెను. కాలభైరవుని పూజ, గంగాపూజ. మున్నగు పూజలన్నియునుం గావింపఁబడెను. విస్తారముగా నన్నదానము జేయఁబడెను భోజనములైనపిమ్మట రామకృష్ణుఁడా బంగారు వడ్లగింజలం దీసికొని, రాయల సముఖమున కరిగెను. రాయల కా గింజలను జూపి, యివి బంగారు ధాన్యము. ఈ

విత్తనమును చల్లినచో బంగారుధాన్యము పండఁగలవట. ఈ యపూర్వబీజములను గాశీనుండి సంపాదించుకొని వచ్చితిని. ఒక సిద్ధుఁడీ విత్తనముల నొసంగి, యివి మీ దేశమునకుం గొనిపొమ్ము. అచ్చట నివి విరివిగా వృద్ధిపొందఁగలవని చెప్పి నా కిచ్చెను. కాఁబట్టి తా మీ విత్తనములను స్వీకరించి పంచింపవలెను. అని చెప్పుచు రామకృష్ణుఁడా గింజలను రాయలకొసఁగెను రాయలవి చూచి సంతసించి, యివి మాన్యక్షేత్రమునం జల్లించెదనని చెప్పెను. అంతట రామకృష్ణుడు, "మీరీగింజలను జల్లించునప్పుడు గమనింపవలసిన ముఖ్యవిషయ మొకటి కలదు. యివి యెన్నఁడు నపానవాయువులు విడువనట్టివారిచేఁ బాతిపెట్టింపవలయును. లేనిచో నివి మొలవవని యీ గింజల నొసంగిన సిద్ధుఁడు చెప్పినాఁడు. కాఁబట్టి యట్టివారిచేతనే యీ గింజలను బాతిపెట్టించుడు, అనెను. ఆహా నపానవాయువులు విడువనివా రెవ్వరైన నుందురా యని రాయలనను రామకృష్ణుఁడంను లకు పోనిండు! తాము స్వయముగాఁ జల్లిన మొలచునేమో కాదా! యనెను. నేనును యేసమయమునందో యపానవాయువులు వదలుచుండినట్లు జ్ఞాపకము! అని రాయలనెను. పోనిండు, అట్టివారే లేరా? దేవరవారి జనానా చిన్నమదేవిగారిచేఁ జల్లింపరాదా? యని రామకృష్ణుఁడడిగెను. అచ్చటను నిదియే యసందర్భముయని రాయలనెను. రామకృష్ణుఁడు, అయ్యో! ప్రపంచకమునందందఱును నపానవాయువులు విడుచువారే కాని, విడువనివారుండరని యెఱిఁగియుండియు, దేవరవారికిఁ జిన్నమదేవిగారిపై నంత యాగ్రహమేల? దేవరవారుకూడ నట్టిపని నొనర్చువారే కదా! అంత యనురాగముతో మెలఁగు చిన్నమదేవిగారి వ్యాజమువలనఁ దమచేఁ బరిత్యజింపఁబడవచ్చునా? యని రామకృష్ణుఁడు రాయలను మందలించెను. రాయలంతయుం గనిపెట్టి రామకృష్ణుఁడు తనను మందలించుటకే యింత యొనర్చినాఁడని గ్రహించి, మఱలఁ జిన్నమదేవిం బరిగ్రహించి, తన భార్యలందఱి మీఁదను సమానానురాగము కలిగి వర్తింపుచుండెను.

## —: గ్రంథ విమర్శనము :—

శ్రీకృష్ణదేవరాయలు రామకృష్ణునిం జూచి యొకనాడు రామకృష్ణా! పెద్దన్నగారు రచించిన మనుచరిత్రమును, ముక్కుతిమ్మన్న రచించిన పారిజాతాపహరణమును, భట్టుమూర్తి రచించిన వసుచరిత్రమును జూచియున్నావుకదా! ఈ మూఁడింటియం దేగ్రంథము బాగుగా నున్నదో, యాలోచించి చెప్పుమనియెను. రామకృష్ణుఁడు దేవా! ఆలోచించుట కేమున్నది? పెద్దన్న రచించిన మనుచరిత్రములో,

ఉ. పాటునకింతులోర్తురె కృపారహితాత్మక! నీవు త్రోయ ని
చ్చోట భవన్నఖాంకురము సోకెఁ గనుంగొనుమంచుఁ జూపి యా
ప్పాటలగంధివేదన నెపంబిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచను మిట్టలనశ్రులు చిందువందఁగన్.

అని వ్రాసినాఁడుకదా!

ఇక ముక్కుతిమ్మన్నగారు దన పారిజాతాపహరణములో,

ఉ. తాను నబుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలియేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోముపయి జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయ కంఠకలకంఠ వధూకలకాకలీ ధ్వనిన్.

అని వ్రాసియున్నాఁడుకదా! ఇంక భట్టుమూర్తి తన వసుచరిత్రములోనో,

శా. ఆజాబిల్లి వెలంగు వెన్నెలకలఁడాయన్ లేక రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమునఁ బటాగ్రంబొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నర వధూరాజత్కరాంభోజ కాం
భోజీమేళవిపంచికారవ సుధాపూరంబు తోరంబుగన్.

అనివ్రాసియున్నాఁడుకదా! ఈమూఁడింటిఁ విలకించినచో నల్లసాని పెద్దన్న యటునిటు నేడ్చినాఁడు, ముక్కుతిమ్మన్నయేడ్పు ముద్దు ముద్దుగానే యున్నది. కాని, భట్టుమూర్తియేడ్పుమాత్రము బావురుమని బహువిస్తారముగాఁ బ్రస్తరింపఁబడియున్నది. ఏదోయేడ్చినారు. కాని, ముగ్గురును మూఁడురీతులుగాను నేడ్చినారు గనుక మువ్వురు యేడ్పులుం గూడ ముచ్చటగానే యున్నవని చెప్పవచ్చును, అనెను. రామకృష్ణునియుక్తిం గని యందఱును నవ్వుకొనిరి.



## —: పింగళి సూరన్న :—

శ్రీకృష్ణదేవరాయలు కొలువుదీర్చియుండుసమయమున రామకృష్ణుఁడు, దేవా! ఏవానికైనను తనయొక్క భార్యాగుణసంపత్తిచేత నేసుఁడీ! సద్యశముగల్గుట! యనెను. అందుపైఁ పింగళి సూరన్న, పురుషునియందు సద్గుణసంపత్తి లేకున్నయెడల భార్యయొక్క సుగుణసంపద సత్కీర్తి యెట్లుకలుగఁజేయఁగలదు! పురుషుఁడుకూడ సుగుణసంపదకలవాఁడై యుండవలయును. దానికిందోడు సుగుణసంపత్తి కల భార్యకావలయును. ఈరెండునుం గూడినప్పుడే యెట్టివానికైన వన్నెవాసి కలుగును. కాని, పురుషుఁడయోగ్యుఁడయినచో, వాని స్త్రీ యోగ్యురాలయినను శోభిల్లదుఅనెను. అందుపై రామకృష్ణుఁడు, నీకు మంచి చెడ్డలుకూడఁ దెలియని యట్లు మాటలాడుచున్నావే! ఇప్పుడు నీవుచెప్పినవాక్యములు నీకవిత్వమునుం బూర్వపక్షము సేయఁగలవు? ఆమట్టున నూరకుండుము. చాలుఁజాలు, అనెను. రాయలది విని, ఓరామకృష్ణా! ఈవాక్యములకును సూరన్న కవిత్వమునకును సంబంధమేమియున్నది? ఈవాక్యము లెందువలన సూరన్న కవిత్వమును పూర్వపక్షము సేయును? అని యడుగగా నందులకు రామకృష్ణుఁడిట్లు సమాధానముఁ జెప్పెను.

ధృతరాష్ట్రుఁడు పుట్టుగ్రుడ్డివాఁడగుటచే రాజ్యముచేయుటకనర్హుఁడైనను, సుతుని యందలి యనురాగమువలన వక్రమార్గగామియయినను, భార్యాగుణసంపత్తిచేతనే ప్రసిద్ధిజెందఁగలిగెనని తన రాఘవ పాండవీయమునందుఁ పింగళి సూరన్న వ్రాసియున్నాఁడు. అట్లువ్రాసియుండియుఁ పురుషుఁడుభార్యాగుణసంపత్తిచేఁబ్రసిద్ధిఁజెందఁగలఁడని నప్పుడీతని కింత కోపమేల? ఈతఁడు పరమఛాందసుఁడు, ముక్కోపి. ఈతనిభార్య మహాపతివ్రత. పరమశాంతురాలు. అట్టి పరమసాధ్వి సీతఁడు బడియలతోఁ బ్రతిదినము నేదియో యొకవంకఁ బెట్టి పడమోదుచుండును. ఓరిమియందు భూదేవికంటె వేయిమడుంగు లెక్కువయగు నీతనిభార్య యామోదులనుసహించుకొని యూరకొనుచున్నది. "ఇల్లంతయునిట్రాళ్ళు తలయంతయుబొవ్వులు" నను నట్లీతని యర్థాంగలక్ష్మిశరీరమంతయు నీతనిప్రహారణములచేతనేకాయలు కాచిపోయినది. ఇతనియొద్ద నెన్నిదుర్గుణములుండినను భార్య పరమసాధ్వి కనుకనే యీతని దుర్గుణములన్నియుఁ గృతఘ్నునకొనరించిన యుపకృతులంబలె నడుగంటిపోయి యీతనికిం ప్రసిద్ధికలుగుచున్నది. ధృతరాష్ట్రుఁడు జాత్యంధుడే యైనను, నప్రయోజకుఁడే యైనను, గాంధారి సుగుణసంపదచేతనేకదా! ప్రసిద్ధి గాంచఁగలిగెను. అందుచేకే కదా! ఈతఁడు తన రాఘవపాండవీయములో,

క. సుబలతనయ గుణమహిమన్
బ్రబలి తనకుదార ధర్మ • పాలనలీలన్
సాబగొంది వన్నెఁదేగా
విబుధస్తుతుఁ డవ్విభుండు • వెలసెన్ ధరణిన్.

అనివ్రాసియున్నాఁడు. ఈపద్యమీతఁడు వ్రాసినదగునో కాదో యడుగుఁడు! ......ఆమాటకుఁ బింగళి సూరన్నకుఁగోపమెక్కుడై పోయెను. ప్రత్యుత్తరమిచ్చుటకుం దోఁపనందున లివ్వునలేచి తన

యింటికిం బోయెను. ఎట్లయినను రామకృష్ణునిఁ బరిహసింపవలెననియు నెట్లయినను నాతని దూషింపవలెననియు నాలోచనము లెన్నియో పింగళి సూరన్న చేయుచుండెను. ఆరేఁడింటియందుఁ గూర్చుండి రామకృష్ణునిపై బగ నెట్లు దీర్చుకొందునా యని యాలోచించుకొనుచుండెను. ఏమియుం గూడఁ దోచుటలేదు. పగలు రెండుయామములై పోయినది. భార్యవచ్చి భోజనమునకు లెండని యెంతఁ జెప్పినను వినుపించుకొనుటలేదు. ఏదియో దీర్ఘాలోచనముఁ జేయుచుఁ గూర్చుండెను, భర్త భుజించిననే కాని యాపరమసాధ్వి భుజింపదు కదా! ఎన్నిసారులనో భోజనమునకు లెండని ప్రబోధించెను. సూరన్న తాను భోజనము చేయను మీ రందఱును భుజింపుఁడని ప్రత్యుత్తరమిచ్చెను. అక్కడ కూర్చుండి తన మనస్సునం దిట్లాలోచించుకొనెను. రేపటి దినమున రాయలయాస్థానమునం దొక మిష కల్పించి, రామకృష్ణుఁడు మేషము భుజించు నలవాటుకలవాఁడని నచ్చబలికి యందఱకును విద్వేషముం బుట్టించి పగదీర్చుకొందునని సూరన్న నిశ్చయించుకొనెను. వెంటనే యొక పద్యమందుకు దగినట్లుగా రచింపనుకట్టి, తాటియాకును గంటమునుం గైకొని, యుత్తరార్థి బాగుగా నాలోచించి దిక్కులు పరికించి మొట్టకేలకు;

క. తెన్నాలి రామకృష్ణుఁడు
  తిన్నాఁడుర తట్టెడంత,

అని వ్రాసి తక్కిన పద్యమప్పటికేమియు స్ఫురింపనందున భోజనమైనపిమ్మట వ్రాయవచ్చునని యెంచి, లేచి నాడమావస్యయగుటచే తుంగభద్రానదికి స్నానమునకుం బోయెను. రామకృష్ణుఁడు భోజనము చేసి, నెమ్మదిగా బయలుదేరి సూరన్నయింటికి వచ్చి, యచ్చట చావడి యందున్న తాటియాకును గంటమునుం జూచి, యా తాటియాకు నందు వ్రాయబడియున్న సగము పద్యముం జూచి, తక్కిన సగము పద్యము నీదిగువరీతిని బూరించి వెడలిపోయెను.

తియ్యనిబెల్లం
జెన్నఁగ మన పింగళి సూ
రన్నకు నోరంత పేడ యైపోయెనురా.

తరువాత సూరన్న స్నానముం జేసి యనుష్ఠానములందీర్చుకొని యింటికివచ్చి భుజించుచుండెను. రామకృష్ణుఁడు రాయలయొద్దకేగి మన పింగళి సూరన్న యీదినముదయమునఁ గోపించి వెడలిపోయినాఁడు. చాలకష్టము కలవాఁడుకదా? ఎప్పుడుభుజించెనో లేదో? చూచివత్తమా? యని యడుగఁగా, రాయలు పెద్దనాది కవులతో బయలుదేరి పింగళి సూరన్న యింటికేగెను. అప్పటికి సూరన్న యింటను భుజించుచుండెను. సూరన్నగారి కుమారుఁడు రాయలు తన యింటికి వేంచేసిరని తెలిసికొని యెదురుగాబోయి లోనికిం గొనివచ్చి రాయలను పెద్దనాదులను చావడియందుచితాసనములపైఁ గూర్చుండఁ బెట్టెను. ఆ సమీపముననుండే సూరన్నచే సగము వ్రాయబడినదియుఁ దక్కిన సగమును రామకృష్ణునిచేఁ బూరింపబడినదియు నగు తాటియాకుండెను. రాయలది చూచి, చేతికిఁ దీసి, యందేమివ్రాయఁబడి యున్నదియో చదువక పెద్దన్నగారి చేతికిచ్చెను. అంతట సూరన్నయు భోజనమును ముగించుకొని వచ్చి రాయలకు కుశలప్రశ్నగావించి యొకచోట విశ్రమించి యుండెను. అప్పుడల్లసాని పెద్దన్న యా తాటియాకునందలి పద్యము నిట్లు బిగ్గఱగా జదివెను.

కం. తెన్నాలి రామకృష్ణుఁడు
తిన్నాఁడుర లొట్టెడంత ◆ తియ్యనిబెల్లం
జెన్నఁగ మన పింగళి సూ
రన్నకు నోరంత పేడ ◆ యైపోయెనురా.

రాయలదివిని ఇదియేమి సూరన్నగారూ! ఇట్లు వ్రాసికొనినారేమని యడుగగా, నతఁడు తలవంచుకొని, యూరకుండెను. రామకృష్ణుఁడు

బెల్లముం దినినాఁడా? నీవు పేడఁ దినినావా? యని పెద్దన్న సూరన్న నడిగెను. రామకృష్ణుని నిందించుటకై పద్యముం జెప్పఁబోఁగా, నది తనకే పట్టుకున్న దేమిరా? ఇది నేను వ్రాసితినా? లేక స్నానమునకుఁ బోయినప్పు డెవ్వఁడైన నిచ్చటికి వచ్చి వ్రాసియుండును? యని యనుకొనుచుండెను. పెద్దనాదులు సూరన్ననుమందలించి ముక్కోపమును మానుమనిచెప్పి యెవరి నివాసములకు వారేగిరి.



## :పిల్లి పెంచుట:

ఒకప్పుడు విజయనగరమునం దెలుకలబాధ మిక్కుటమాయెను. ఆ బాధను బడఁజాలక యూరిలోనివారందఱును తమ తమ యిండ్లయందు రెండేసి మూడేసి పిల్లులను బెంచుకొనుచుండిరి. రాయలు తనయుద్యోగస్థులందఱకు నొక్కొక్క పిల్లిపిల్ల చొప్పునం బెంచుకొనవలెనని యొక్కొక్కని కొక్కొక్క పిల్లిపిల్లనిచ్చెను. ఆ పిల్లిపిల్లకు పాలకొఱ కొక్కొక్క పాడియావుం గూడ నొసంగెను. కవిశ్రేష్ఠులకు, పండితులకు, సామంతులకు, సేవకులకు, వారువీరి కనవేల? అంతఃపురజనులకుం గూడ నాప్రకారముగానే యొక్కొక్క పాడియావును నొక్కొక్క పిల్లిపిల్లయు నొసంగఁబడెను. రామకృష్ణుఁడుఁగూడ నొక పిల్లిపిల్లను నొక పాడియావునుం బుచ్చుకొనెను. రామకృష్ణున కావుపాడియనిన మిక్కిలి యిష్టము. ఆవునేయియే కాని గేదెనేయి వడ్డించుకొని భుజించుట కాతని కంగీకారము లేదు. నేయి యన్నమునందు వైచుకొనుటయే కాక యభ్యంజనముం జేయుటకును, కూరలు వండుటకును, భక్ష్యముల నొనరించుటకును నూరగాయలు వెట్టుకొనుటకుం గూడ నావునేయి యుపయోగింపఁబడినచో నాతనికిఁ బరమసంతోషము. కావున నాతనికి సామాన్యముగా నెల్లప్పుడు

నుం బడి యావులపాఁడి యున్నచో నీని కిన్నిఁటిని సరిపడియుండుట గాని, యేనుఁగునకు వెలగకాయలు లొటలొటలనునట్లు, సామాన్యమైన యొక యావుపాడి యే మూలకు సరిపోవును? అదియునుం గాక రామకృష్ణుఁడెప్పుడును భోజనములోఁ బాలనే యుపయోగించును గాని చేసిన మజ్జిగ నెప్పుడు నుపయోగించుకొనఁడు. భోజన సమయమునందుగూడ నాతనికి దాహమునకుఁ బాలు గావలయును. ఇతరసమయములయం దెప్పుడు దాహముపుచ్చుకొనను బాలనేకాని నీటిని బుచ్చుకొనఁడు. పాలలోఁ జేయఁబడిన "కోవా" యనిన రామకృష్ణునకు మిగుల నిష్టము. కాఁబట్టి రామకృష్ణుఁడు తాను పెంచుకొనుచున్న పిల్లికి గంజి యలవాటుపరచి, తానా పాలనన్నిఁటి నుపయోగించుకొనుచుండెను. సాధారణముగాఁ బిల్లులు పాలు త్రాగుటలవాటు గలవిగనుక నొకనాఁడెటో యీ పిల్లి పాలకుండపై మూఁత బడఁ [illegible]ని పాలను త్రాగివైచెను. అప్పటినుండియు నా పిల్లి పాలరుచి నెఱింగినది కావున రామకృష్ణుని యింటియందుండు పాల నే సమయమునందో వచ్చి త్రాగివైచి పోవుచుండెను. రామకృష్ణుఁడది కనిపెట్టి యొకనాఁడు పాలు కాగిన తరువాతఁ జల్లారకుండఁగనే యా పాల నా పిల్లియెదుటఁ బెట్టెను. ఆ పిల్లి యా పాల నాతురతతోఁ ద్రాగఁబోయి మూతి నా వేడిపాలయందుంచెను. వెంటనే నోరు కాలినంతన నది దూరముగాఁ బాఱిపోయెను. మఱునాఁడు రామకృష్ణుఁడా పిల్లినిఁ బట్టుకొని, వేడిపాలకుండయొద్దకుఁ దీసికొనిపోయి యచ్చట విడిచెను. మఱల నా పిల్లి యాపాలం ద్రావఁబోయి మూతి కాలఁగా దూరముగాఁ బఱువెత్తుకొని పోయెను. మూఁడవనాఁడు రామకృష్ణుఁడు వేఁడిపాల నొకపళ్లెరమందుఁ బోసి యచ్చట నాపిల్లిని పెట్టి పాలుత్రాగ సంజ్ఞచేసెను. వెంటనే యాపిల్లి యాపాలం ద్రాగఁబోయి మూతికాలి పోయినందున రోజుచు బఱుగెత్తెను. అప్పటినుండియు నాపిల్లి పాలు

త్రాగుమని చల్లాఱినపాలు దానియెదుట నుంచినను త్రాగుట మాని వైచెను. ఒకనాఁడు శ్రీకృష్ణదేవ రాయలు కవీశ్వరుల నందఱను జూచి మీమీ పెంచుచున్నపిల్లుల నిచ్చటికిఁదీసికొనిరండు చూతము" అనిపలికెను. మఱునాఁడందఱును దమతమపిల్లులను రాయలయొద్దకుఁ గొనికొనివచ్చి చూపిరి. రామకృష్ణుఁడుకూడ వారితోఁబాటు తనపిల్లిని దీసికొనిపోయి రాయల కగపఱిచెను. "నీపిల్లిచిక్కిన" దేమని రాయలు రామకృష్ణు నడిగెను. అందులకు రామకృష్ణుఁ డయ్యా! నేనేమిచేయుదు? అందఱి వలెనే నేనును నాపిల్లిని బెంచితిని. నా పిల్లి పాలు త్రాగదు! మఱి యింకేమి తెచ్చిపెట్టఁగలను గంజిపోసి పెంచు చున్నాను. దీనికి గంజియనిన మిగుల నిష్టము" అని బదులు చెప్పెను లోకములో నెచ్చటనైనను బాలు త్రాగని పిల్లియుండునా? యని రాయలడిగెను దేవరవారు నమ్మకుండినచో నేనేమి చేయఁగలను? ఇంకను పాలుతెప్పించి దీనియెదుటఁ బెట్టి పరీక్షించి చూడుఁడు. గంజియు దీనియెదుటఁబెట్టించి చూడుఁడు. ఏది యీపిల్లి త్రాగునో కనిపెట్టుఁడు. అందలి యథార్థమప్పుడు తేటపడఁగలదని రామకృష్ణుఁ డనెను. వెంటనే రాయలవారు పాలఁదెప్పించి యాపిల్లియెదుటఁ బెట్టించిరి. ఆపాలను జూడఁగానే యాపిల్లిదూరముగాఁ బాఱిపోయెను రాయలదిచూచి యాశ్చర్యపడి, గంజి తెప్పించి యాపిల్లి యెదుటఁ బెట్టింపగా నాపిల్లి యాగంజిని గడుపు నిండుపర్యంతమును విడువక త్రాగివైచెను. అదిచూచి రాయలు "రామకృష్ణా! నీవు మిగుల చమత్కారముగలవాఁడవు. నీవలెనే నీవుపెంచిన పిల్లికూడ చమత్కారముగలది సుమీ!" యని నవ్వుకొనెను.



## కుమ్మరమొల్ల

శ్రీకృష్ణదేవరాయల కాలమునఁ గుమ్మరకులమునందుఁబుట్టిన మొల్ల యను పేరుగల యొక విదుషీమణియుండెను. ఈమె కవిత్వము మంచి రసవంతముగానుండును. చిన్నతనమునందే యీమె యొక్క భర్త చనిపోయెను. ఈమె తనకులమునందు మాఱు మనువుపోవు నాచారము లేమింజేసి మఱల వివాహముఁ జేసికొనకుండెను. చిన్నతనమునుండియు నీమెకు విద్యాగంధముకలదు. భర్త పోయిన వెంటనే యీమె శ్రీశైల శైవారాధ్యులవారి యొద్దకుం బోయి, యాతనికిఁబరిచర్యలుసలుపుచు, నాతనివలన విద్యనేర్చుకొనుచుండెను. చక్కని కవిత్వమలవడిన పిమ్మట తా రచించిన పద్యముల నమ్ముకొనుచు నందువలన లభించిన ద్రవ్యముతోఁ బొట్ట పోసికొనుచుండెను. ఇట్లు కొంతకాల మగునప్పటికి శైవారాధ్యులవారు వృద్ధులై పరమపదము జెందిరి. తరువాత నాతని యాస్థియంతయు నాతనికిఁ బరిచర్యసేయుచున్నందున నీమెకు సంక్రమించెను. శ్రీశైవారాధ్యులవారికి వారసు లెవ్వరును లేమింజేసియు, చాలకాలమునుండి యీమె తనకు పరిచర్య సేయుచున్నందువలనను నీమె మిగుల గుణసంపత్కలది యగుట వలనను శ్రీశైవారాధ్యులవారు మరణముం బొందునపుడు తన యావదాస్తియు నీమెకిచ్చివైచిరి. అందువలన మొల్లకు జీవనోపాధికి లోపము లేకుండ జరిగిపోవుచుండెను. ఇప్పుడు మొల్ల యెవ్వరి నాశ్రయింప నక్కఱ లేకుండెను. తానను భవించుటకును నితరులకు దానధర్మములు చేసికొనుటకును దగినంత ద్రవ్య మీమెయొద్ద యుండెను. ఆకారణము వలనఁ గవులెవ్వరైన మొల్లయొద్ద కరిగినచో మొల్ల తన శక్తికొలఁదిని వారిని సత్కరించుచుండెను. ఈమె భక్తిపూర్వకముగా రామాయణమును రచిం

చెను. రాయలను సందర్శించి రామాయణమును రాయలకుం గృతి యిచ్చిన సమ్మానముం బొందవలయునను నాశతప్ప మొల్లకిప్పు డితర వాంఛలేమియు లేకుండెను. కాబట్టి మొల్లతాను రచియించిన రామాయణముం గైకొని కతిపయప్రయాణంబుల విజయనగరముం జేరెను. ఎట్లెట్లో రాయలను సందర్శించి, తన రామాయణమును విని కృతినందుమని కోరెను. రాయలందుల కంగీకరించెను. రాయల యాస్థానమున మొల్ల తన రామాయణముం జదివి వినిపించుటకొక దినమేర్పాటు కావింపఁబడెను. నియమిత దినమునందు పౌరులందఱును రాయల యాస్థానమునకు వచ్చియుండిరి. స్త్రీయొకతె రామాయణమును రచించినదట! అందునను వది కుమ్మరజాతి స్త్రీయట! ఆశ్చర్యముకాదా? ఏజాతి స్త్రీయైననేమి? సద్విద్యగలచోట జాతి విచక్షణయేల? నియమిత సమయమునకు మొల్ల తన రామాయణముం గైకొని యాస్థానముకరిగెను. మొల్లకొక యాసనము వేఱుగా వేయఁబడియుండెను. ఆ యాసనముపై మొల్ల కూర్చుండెను ఆసమయమున రామకృష్ణుఁడు లేచి, రాయలతో "దేవా! నావొక చిన్నవిన్నపమనెను. రాయలది యేమని యడిగెను. నేనొక కావ్యమును రచించి దేవర కంకితము సేయఁదెచ్చితిని. స్వామీ శుభముహూర్తమున దానిం గృతినొందవలయునని యడిగెను. మొల్ల తన రామాయణముం జదివిన తరువాత నీ గ్రంథము జదువవచ్చునని రాయలనెను. దేవా! నా గ్రంథము రామాయణమంత పెద్దగ్రంథము కాదు. ఒక్క ముహూర్త కాలములో జదివి వినిపింపఁ గలిగినంత చిన్న గ్రంథము. అదియునుగాక నేను బ్రాహ్మణుఁడను గదా! బ్రాహ్మణుని కవిత్వము వినిన తరువాత నితరుల కావ్యము వినుట సముచితము. అందువలనే నేనిట్లు కోరితినని యనెను. అట్లయినచో నదియే మొదట గానిమ్మని రాయలనుజ్ఞనిచ్చెను. రామకృష్ణుఁడు లేచి నిలువఁబడి, యిట్లు చదువనారంభించెను.

"శ్రీ ముంచిగ వ్యాసుని... రచియింతు జిత్తగింపు" అని చదువునప్పటికి మొల్ల యచ్చటినుండి లేచి వెడలిపోయెను. రామకృష్ణుని దినమునకు సారవరాగముల కథకారముస్నందున నెవ్వరు నేమియు

పనఁజాలకఁపోయిరి. మొల్ల తన రామాయణమును నరాంకితము చేయఁగూడదనియు, తనకెట్లయినను జరుగుబాటున కేమియులోపము లేదనియు, రామకృష్ణుఁడు కొంటె వాఁడగుటచేఁ దనకు రాయల యాస్థానమునందు గౌరవము గలుగనీయఁడనియు దలఁచి, తన రామాయణమును రాయల కంకితముసేయు నుద్దేశమును మార్చుకొని, శ్రీరామచంద్రమూర్తికి కంకితముఁ జేసివైచెను. ఆ వృత్తాంతమంతయు రాయలెఱింగి, రామాయణము మాకుఁ గృతినొసంగుట కంటెఁ బరమదైవమగు శ్రీరామచంద్రమూర్తికిఁ గృతినొసంగుట మాకెంతయుఁ బరమసంతోషమని మొల్లకు వర్తమానమంపి, నీవంటి విదుషీమణి, మాపట్టణమునందుండక తప్పదనియు, నీకుఁ దగినవసతులేర్పఱచెదమనియు, మొల్లకుంజెప్పి, మొల్ల విజయనగరమునందే నివాసముగా నుండునట్లు చేసి యామెకుఁ దగిన వసతి గల్పించి యిచ్చెను. మొల్లవిదుషీమణియైనను నిగర్వచూడామణి. తనకు లాభారాను సారముగాఁ బ్రవర్తించునే కాని భేషజ మేమియుం జూపదు. సంతలోని సరకులుసయితము తాను స్వయముగానే పోయి కొనితెచ్చుకొనుచుండును. సుగుణసంపత్తియందు మొల్లకుసాటివచ్చు స్త్రీలు కుమ్మరకులమునందే కాక, యగ్రవర్ణములయందును నఱుదు.

ఒకనాఁడు మొల్ల సంతకుంబోయి, కోడిపెట్ట నొకదానినిం గొని, దానినొక చేతితోఁబట్టుకొని, రెండవ చేతితో గొలుసుతోఁగట్టఁబడిన యొక కుక్కను బట్టుకొని యింటికేగుచుండెను. రామకృష్ణుఁడామెను బజారమునందుండి చూచి, యామె కెదురుగాఁ బోయి యామె నెట్లైయిన నాక్షేపింపవలెనను కుతూహలముగలవాఁడు కావున, "మొల్లా! పావలానిచ్చెదఁ బెట్టనిచ్చెదవా? లేక పరహాయిచ్చెదఁ గుక్కనిచ్చెదవా? యని యడిగెను. అందుపై మొల్ల "నీవేమి యొసంగనెంచినను, నీకు నేనమ్మనుగాదా! రామకృష్ణా! యని యామె పలు

చెప్పెను. అప్పటినుండియు రామకృష్ణుఁడు బుద్ధితెచ్చుకొని మొల్లను మాతృసమానముగాఁ బరిగణించుచు గౌరవించుచుండెను. మొల్లయు నాతనియందుఁ బితృభావముంచి సగౌరవముగాఁబ్రవర్తించుచుండెను ఇట్లు వారుభయులు నన్యోన్య గౌరవములు గలిగి, ప్రవర్తించుచుఁ ఆనందముగాఁ గాలక్షేప మొనరించుచుండిరి.

—: రామకృష్ణుఁడా? రామలింగఁడా? బాచిఁగాఁడా? :—

తెనాలి రామకృష్ణుని చరిత్రము వ్రాయునప్పుడెన్నియో యంశములను జర్చింపవలసియున్నది. రామకృష్ణుఁడు కృష్ణదేవరాయల కాలమునాఁటివాఁడు కాఁడనియు, కృష్ణరాయని యనంతరమునను గొంతకాలమైనపిమ్మట జనించెననియుఁ గొందఱి యభిప్రాయమైయున్నది. అదియే నిశ్చయమైనచోఁ బైయంశములన్నియు నసత్యములై యుండవలయును. ఎట్లు నిర్ధారణ మొనర్చుటకును దగినంత యాధారములేవియుఁ గానరావు. రామకృష్ణుని కథలని చెప్పుచుఁ బూర్వమునుండియు ననుశ్రుతముగాఁ జెప్పుకొనఁబడుచున్న యంశములంబట్టి చూచినయెడల నవి సత్యములే కాని కల్పితములుకావని తెలియఁబడకమానదు. "తృవ్వట బాబా" యను పద్యము వ్రాయుటకనువుపడునదికాదు. వేదమువలె, సంగీతమువలె, నానాటినుండి నానోటి ననుశ్రుతముగా రావలసియున్నది. అట్లే యది యప్పటివరకును మన దేశమునం దెవ్వరినోటనో యొకరినోట నుచ్చరింపఁబడుచునే యున్నది. అందువలననే కదా! యది నశించిపోకుండుటకుఁ గారణము! కల్పితగాథ సామాన్యముగా నిజమైన గాథవలెఁ బరంపరగాఁ జెప్పుకొనునంతటి విశేషముకలదిగా నుండదు. దాని కంతశక్తియునుండదు. నిజమైన గాథకే బలమెక్కువ కనుకనే యది శా

శ్వేతముగాఁ బ్రజలచేఁ జెప్పుకొనఁబడుచుండును. కాఁబట్టి పైన వ్రాయఁబడిన యంశము లొకవానికొకటి విరుద్ధముగా నగపడుచున్నను, మొత్తమునకు రామకృష్ణుఁడు కృష్ణరాయల కాలమునాఁటికే యుండి యున్నాఁడని చెప్పకతప్పదు. ఇతరకారణములు కొన్నిఁటివలన రామకృష్ణుఁ డిటీవలవాఁడని చెప్పనెంచినను, రాయలకాలమునందునే రామకృష్ణుఁడుండియున్నాఁడని చెప్పనప్పుడు దొరకు నాధారములంతె బలీయ మైనవిగా నగపడవు. రామకృష్ణుఁడు రచించిన గావ్యములలో నొకండగు పాండురంగ మహాత్మ్యమను గ్రంథము విహారి వేదాద్రి మంత్రి కంకితముఁ జేయఁబడెను. ఈ వేదాద్రి మంత్రి, గురవరాజు కుమారుఁడైన పెదసంగ భూపాలునకు మంత్రియైనట్లు పాండురంగ మహాత్మ్యమునందలి యీ దిగువ పద్యమువలనం దేటపడఁగలదు.

తే॥ గీ॥ గురుతుగలరాజు మంగయ గురవరాజు
పుత్త్రుఁ బెదసంగ భూపాలుశత్రుజైత్రు
భానసమతేజు విద్యావధాన భోజుఁ
గొల్చి, వేదాద్రి సత్ఫలక్ష్ములఁ బడసె॥

ఈ గురవరాజు కుమారుఁడైన పెదసంగరాజు, కృష్ణరాయల సామంతరాజులలో నొకఁడైనట్లు పెరిస్తాయను విదేశ చరిత్రకారుడు వ్రాసియున్నాఁడు. అదియుఁగాక బొడ్డుచర్ల తిమ్మన్న యను నాతనిపై రామకృష్ణుడు రచించిన పద్యముం బట్టి చూచినచో నీతడు తప్పక రాయలనాఁటివాఁడేయని నిశ్చయము కాకమానదు.

క. శతసంఖ్యలొక్కటైనను
సతతము శ్రీకృష్ణరాయ జగతీశునితోఁ
జతురంగమాడి గెల్చును
ధృతిమంతుఁడు బొడ్డుచర్ల తిమ్మన భళిరే



## —: రామకృష్ణాభిధానము :—

రూరి వేదాద్రి మంత్రి రామకృష్ణునిం బిలిచి పాండురంగ మాహాత్మ్యమును దనకుఁ గృతియొసంగుమని యడిగినట్లితఁడు చెప్పుకొనిన పద్యమువలన రామకృష్ణుఁడు తన యుదంతమును గొంత చెప్పుకొనియున్నాఁడు. తన పేరును తన తలిదండ్రుల పేర్లను నిందు ననే వక్కాణించి యున్నాఁడు.

క. నను రామకృష్ణకవి గని
జన సహకారావళీవసంతోత్సవ సూ
క్తినిధిఁ బిలిచి యర్థా
సనమునఁ గూర్చుండఁ బనిచి చతురత ననియెన్.

సీ. జగతి సొబగుల నన్నగఁ గావ్యధారల
ఘనుఁడవు వసువందుఁ గరము మేటి
వఖిలక్షోణీపాల కాస్థాన కమలాక
రోదయ తరుణ సూర్యోదయుఁడవు
శైవవైష్ణవ పురాణావళీ నానార్థ
రచనాపటిష్ఠైక రమ్యమతివి
లౌకిక వైదికలక్షణచాతుర్య
ధైర్య ప్రభావాఢ్య కావ్యచణుఁడ
వరయ భూమికుచాగ్రహారాభమైన
శ్రీ తెనాల్యగ్రహార నికేతవర
శాఖికాకోకిలమవీవు సరసకవివి
రమ్యగుణ కృష్ణ! రామయ రామకృష్ణ.

క. కౌండిన్యస గోత్రుఁడవా
ఖండలగురు విభుఁడ వఖిలకార్య రససుధా

మండల వినతుఁడవు భూ
మండల వినతుఁడవు లక్ష్మమాంబతనయా

అని వ్రాసికొని యుండుటంబట్టి ఈతని గాపురస్థలము తెనాలి యగ్రహారమనియు, నింటిపేరు తెనాలివారని తండ్రిపేరు రామయ్య యనియు, తల్లిపేరు లక్ష్మమ్మయనియు, గోత్రము కౌండిన్యసగోత్రమనియు, లౌకిక వైదికాచార పరాయణుడైన యాటుమేలనియోగి బ్రాహ్మణుడనియుఁ దెల్లమగుచున్నది.

కొందఱీతనిపేరు తెనాలి రామలింగమనియు, మఱికొందఱు తెనాలి బాచిగాఁడనియుం గూడఁ జెప్పుట వినుచున్నాము. రామలింగఁడు, బాచిగాఁడు (బాచన్న) నామము లెట్లు వచ్చినవో చెప్పుట గ్రంథస్థములైన యాధారము లెవ్వియుఁ గానరావు. "భాస్కరశబ్దము. "బాచ" యగునట్లు గొన్ని యాధారములున్నవి కాని, రామకృష్ణ శబ్దము రామలింగఁడని మాఱుటకుఁదగిన యాధారములెవ్వియుం గానరావు. రాయలమంత్రి భాస్కరుని సంబోధనములు కొన్ని "రాయని బాచా!" యని యున్నట్లు, వినుచున్నాము. "రాయని బాచనితోనే, పోయెనుగా కీర్తి కాంత పోలేదదిగో; యాయన మనమనుమఁడు" అనియుం గూడఁ గొన్ని చాటువు లగపడుచున్నవి కాని రామకృష్ణునకు బాచిగాఁడను పేరెట్లు కలిగినదో యది విచారణీయమై యున్నది. పాండురంగ మాహాత్మ్యమునందును, ఘటికాచల మాహాత్మ్యమునందునుంగూడ నీతని గద్యయొకే తీరుగానున్నది. దానింబట్టి యీతని చరిత్రముం దెలిసికొనుట కేమియు నాధారము దొరకదు. "ఇది శ్రీమత్పరమ పదనాథ నిరవధిక పరిపాక పరిచిత సరస కవితా సనాథ తెనాలి రామకృష్ణ కవినాథ ప్రణీతంబైన" యనియే పై రెండుగ్రంథముల యందుంగూడ వ్రాయబడి యున్నది.

+ గ్రంథకర్త "శ్రీ శాస్త్రి యన" "ఈటుమేల నియోగి"యని పొరఁబడినాడు [illegible]

తెనాలి రామయ్య యొకప్పుడు క్షయరోగము గలిగినందున బాధపడుచుండెను. ఎంతమంది వైద్యులచే నెన్ని చికిత్సలు చేయించికొనినను నది కుదురకుండెను. నాకీ రోగము నివారణమైనచో నాకుఁ గుమారుఁడు కలిగిన తప్పక మీ పేరుఁ బెట్టెదనని శ్రీరామునకును శ్రీకృష్ణునకును మొ్రొక్కుకొనెను. ఈతని యర్ధాంగ లక్ష్మియైన లక్ష్మమ్మ తన ప్రాణనాథున కీ జబ్బు కుదిరినచో తనకు జనించు పుత్రునకు సూర్యనారాయణమూర్తి పేరు పెట్టెదనని మొ్రొక్కుకొనెను. సూర్యనమస్కారములం గావించుచు ననిశము సూర్యదేవు నారాధించుచుండెను. ఇట్లు కొంతకాలమగునప్పటికిఁ దెనాలి రామయ్యకు క్షయరోగము పూర్తిగా నివారణమయ్యెను. పిమ్మట నా దంపతులకు పుత్రుఁడు జనింపఁగా నాతనికి, యా ముగ్వుర దేవతల పేర్లతోను, "భాస్కర రామ కృష్ణుఁడని నామకరణముం గావించిరి. ఆతని మొట్టమొదట భాస్కరుఁడని పిలువఁజొచ్చిరి. అందువలననే భాస్కరశబ్దభవమగు బాచఁడు, బాచిగాఁడు" నను నామము లాతనికిం గలిగినవి. గ్రంథముల యందే కారణముచేతనో కాని రామకృష్ణుఁడు తన యభిఖ్యయందలి మొదటిదగు భాస్కరశబ్దమును విడిచిపెట్టి రామకృష్ణుడని మాత్రమే వ్రాసికొని యున్నాఁడు. ఇదియును గొంత నమంజసముగానే యున్నది. పెద్దపేరు పెట్టుకొనక చిన్న పేరుతోనే వ్యవహరింపఁబడినచో నాయుర్భాగ్యములు పట్టునని యా కాలపువారి తలంపు. అందుచేతనే కాఁబోలును! ఆ కాలమునం దెట్టి ఘనునికైనను నిప్పటి వారింబలెఁ బెద్ద పెద్ద నామములుంచఁబడక, చిన్న చిన్న పేర్లుంచబడినట్లు గ్రంథములయందుఁ జూచుచున్నాము.

ఇఁక రామలింగఁడను పేరెట్లు కలిగినదో విచారింపవలసియున్నది. తెనాలి రామకృష్ణుఁడు కేవలము విశిష్టాద్వైత మతస్థుఁ

మాత్రమే కాక సర్వమతములకును సమ్మతమైన యద్వైత సంబంధమగు స్మార్తమతస్థుఁడగు నియోగి బ్రాహ్మణుఁడగుటచే రామకృష్ణుఁడనినచోఁ గేవలము విశిష్టాద్వైత ప్రాధాన్యముగా నుండునేమో యని యెంచి, తనపేరు చివరను లింగశబ్దముం జేర్చుకొనిన సమంజసముగా నుండునుగదా! యని రామలింగమని చెప్పుకొని యుండవచ్చును. ఏది యెట్లున్నను రామకృష్ణుఁడు మహా విద్వాంసుఁడగు కవియనుటకేమియు నాక్షేపణములేదు. ప్రఖ్యాతిఁగాంచిన మహాపురుషున కేపేరైననేమి? లోకమునందు గుర్తుకొరకుగదా! నామధేయముః కాఁబట్టి తెనాలి రామకృష్ణునకుఁ బై నుదహరింపఁబడిన రామకృష్ణుఁడు, రామలింగఁడు, రాచన్న, భాస్కర రామకృష్ణుఁడు, నను నాలుపేర్లును గూడఁ గలవనియే, లేవని తగినంత యాధారము దొరకువఱకు మా యభిప్రాయము.



### కత్తికుక్కను గంగిగోవుగా నొనరించుట.

ఒకనాఁటి యుదయమున శ్రీకృష్ణరాయలు క్షురకర్మచేయించుకొననెంచి క్షురకునకు వర్తమానమంపెను. ఆక్షురకుఁడు రాయలయొద్ద కేతెంచునప్పటికి రాయలకు నిద్దురవచ్చి గాఢ నిద్రపోయెను. క్షురకుఁడు మెల్లగా రాయలయొద్ద కేతెంచి రాయలకు నిద్రాభంగము కాకుండునట్లు నేర్పుతో క్షౌరముంజేసి వెడలిపోయెను. కొంతసేపునకు రాయలకు మెలఁకువగలిగెను. రాయలెప్పుడు నిద్రించినను లేచిన తరువాత నద్దములోఁ దనముఖముఁ జూచుకొనకుండ, నితరుల మోముం దిలకింపఁడు కావున నానాఁడు గూడ నద్దములోఁ దన మోముం దిలకించునప్పటికి తన గడ్డము నున్నగా నగపడెను. అప్పుడు రాయలు తన పరిచారకునిం బిలిచి నేను నిద్రించుచుండఁగనే.

నాకు క్షౌరముం జేసిన వాఁడెవ్వఁడని యడిగెను. తాము పిలిపించిన మంగలివచ్చి క్షౌరముం జేసి పోయెనని వాఁడు ప్రత్యుత్తరమిచ్చెను రాయలు వెంటనే యా మంగలివానిం బిలిపించి వాని పనితనమునకు మెచ్చుకొని నీ కేమి కావలసిన నది యొసంగెదము. కోరికొనుమని ను. వాఁడందులకు దేవా! నన్ను బ్రాహ్మణునిగా నొనరింపుఁడని కోరికొనెను. రాయలు తన పురోహితునిం బిలచి యా మంగలి బాచిగానిని వెంటనే బ్రాహ్మణునిగా జేయుమని యాజ్ఞాపించెను. మంగలివాఁడు బ్రాహ్మణుఁడెట్లగును? మంగలివాండ్రను బ్రాహ్మణులలోఁ గలిసి బ్రాహ్మణకులమును బాడుచేయుటకు రాయలెంచెనని యూరందఱును గుజగుజలు పోఁజొచ్చిరి. పురోహితుఁ డామంగలివానిం దోడుకొనిపోయి తుంగభద్రలో స్నానములు చేయించుచు మంత్రములు చదువుచు జపతపాది సాధనము లొనర్చుచుండెను. రాయలుకూడ స్వయముగాఁ దుంగభద్రానది కేగి మంగలిబాచిగాఁడెంత వరకు బ్రాహ్మణుఁడయ్యెనో పరీకించుచుండెను. ఇట్లు వారములు దినములు గతించెను. ప్రతిరోజునను మంగలి బాచిగానిని స్నానములు చేయింపుచుండిరి. రాయలు మంగలి బాచిగాఁడు బ్రాహ్మణుఁడగు పర్యంతము తానుగూడ నచ్చటనే యుండెదనని తుంగభద్రాతీరముననే విడిసియుండెను. బాచిగాఁడింకను బ్రాహ్మణుఁడు గాలేదు. ఎప్పటికే యూహపుట్టి రాయలెప్పుడేకీతి సన్న నిచ్చి బ్రాహ్మణ కులమును బాడుచేయునో యని పట్టణమునం గల బ్రాహ్మణులందఱును భయపడుచుండిరి. రామకృష్ణుఁడీ యుదంతమును విని నల్లకుక్క నొకదానిని గొలుసుతోఁ గట్టి తుంగభద్రానదికిం గొంపోయి యా రేవునందే యా కుక్కను స్నానముఁ జేయించుచు ను జలుమఱల నొడ్డున కీడ్చుకొని వచ్చుచు, మఱలమఱల నదిలోనికీడ్చుకొనిపోయి ముంచుచు మంత్రములను జదువుచు నా కుక్కను బరిశ

విధముల బాధింపఁజొచ్చెను. కైంయో కైంయో మని యా కుక్క-
ఱోదనముచేయఁ జొచ్చెను. రాయలదిచూచి, ఇదియేమి రామకృష్ణా!
నీకు మతి పోయినదా యేమి? ఈ కుక్కనట్లు నీటిలో ముంచుచు
బాధించుచున్నావని యడిగెను. అందులకు రామకృష్ణుఁ డయ్యా!
ఈ కఱ్ఱికుక్కను గంగిగోవుగాఁ జేయఁదలఁచుకొంటిని కాబట్టి దీని
నిట్లు మంత్రములతో స్నానములం జేయించుచున్నాననెను. ఎన్ని
మంత్రములు చదివినను, పుణ్యనదులయందెన్ని స్నానములు చేయిం
చినను కఱ్ఱికుక్క గంగిగోవు కాగలదా? యని రాయలడిగెను.
రామకృష్ణుఁడు దేవా! మంగలిబాచిగాఁడు స్నానముచేసి బ్రాహ్మ
ణుఁడు కాగలిగినప్పుఁడు కఱ్ఱికుక్కమాత్రము గంగిగోవు కాఁజాలదా?
యని ప్రత్యుత్తరమిచ్చెను. రాయలు తా నొనర్చిన యవివేకమును
గుర్తెఱింగి రామకృష్ణుఁడు తనకు బుద్ధిచెప్పుటకై యిట్లొనరించినాఁ
డని తెలిసికొని, మంగలింబిలిచి యోరీ! నీ వెన్నిస్నానము లొనరిం
చినను బ్రాహ్మణుఁడవు కాజాలవు. మఱి యే దేనిం గోరుకొనుము.
విపరీతమయిన కోరికవలన నీకు ప్రయోజనము లేదని మందలించి
యందఱను బ్రాహ్మని సెలవొసంగి రామకృష్ణునితోఁ గూడి తానును
నింటికిం జనెను. రామకృష్ణుఁడొనరించిన యుక్తికందఱును సంత
సించిరి.

—: తిమ్మరసు మంత్రి :—

శ్రీకృష్ణ దేవరాయ లుత్తరదిగ్విజయ యాత్రకు బయలుదేఱి
పోయినప్పుడు రాయలతో రామకృష్ణుఁడు కూడఁబోయియుండెను.
రాయలు కళింగదేశమును జయించెను. సింహాచల క్షేత్రమును సం
దర్శించి భూదాన గోదాన హిరణ్యదానములను బెక్కులు గావిం
చెను. సింహాచలములో జయస్తంభములను బాతించి యందు జన

విజయములను వ్రాయించెను. అప్పుడు సేనాపతిమ్మరసను మంత్రి సత్తముఁడుగూడ ననేక దానము లొనరించెను. తక్కిన కవులందఱును తిమ్మరుసు నందు మహా భయ భక్తులతో మెలఁగుచుండిరి కాని, రామకృష్ణుఁడు మాత్రము తిమ్మరుసునకు సాటివాఁడగుటచే నతనియందలక్ష్యమును జూపుచుండెను. ఆ కారణమువలన రామకృష్ణునియందు తిమ్మరుసునకు నిరాదరణబుద్ధి జనియించి యుండెను. రామకృష్ణుని పినతాత మనుమఁడగు మంత్రిప్రగడ బుచ్చివెంకన్నకు గోనేడయను గ్రామము నగ్రహారముగా నొసంగుమని రామకృష్ణుఁడు రాయలతో మనవియొనర్చెను. తిమ్మరసు దానికడ్డుసెప్పి బుచ్చివెంకన కీయకుండఁ జేయుటకై ప్రయత్నించెను. అప్పుడు రామకృష్ణుఁడు తిమ్మరుసుపై నలిగి

*ఉ॥ లొట్ట యిదేటిమాట పెనుఁగోభులతో మొగిఁ బోటుమేల? తాఁ
గట్టక యున్న వృశ్చికముకుమ్మొర పూర్వనియంమ రేకదా!
ఫట్టపురాజుపట్టి సరిపడ్డెన రాసరి యీయకున్న నేఁ
డిట్టకమాన; నామశము తీవ్రమహోగ్ర భయంకరంబుగాఁ,
దిట్టితి నామహోగ్రమహిమతిన్ మకరగ్రహఘుష్కరీ భటా
పట్టప్రపట్టఫాలఫణి భర్తృబహూకృత పట్టనుట్టా
ఘుట్టణ దట్టవాలక విఘట్టవిరగ్ర రాజభృత్యా
చట్టచజూర్చటీ నయన జ్వర్ఝరలు రాలఁగావలెన్
జుట్టుజికంబునంబొగడఁ జూపితినారవితా ద్వరిష్యకా

---

*ఈపద్యమును భట్టుమూర్తి రచించెనని మా॥ రా॥ రా॥ శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ తిమ్మరసు మంత్రి చరిత్రమున వ్రాసియున్నారు. విదేశస్థుల వ్రాంతలను విశ్వసించుచు వారివ్రాంతల నాధారముగాఁ దీసికొన్న వీరట్లు వ్రాసినను వ్రాసి యుండవచ్చును. విదేశచరిత్రకారులు వ్రాసినవ్రాంతలకును మనవారు వ్రాసినవ్రాంతలకును గలవ్యత్యాస మగపడుచున్నందున మాకవి విశ్వాసపాత్రములు కాఁజాలవు.

పట్టణముఖ్యరంగ గతభవ్యవధూవదనానుషంగసం
ఘట్టిత శిరస్థగాంగ ఘనసారహల్లక జాలసుధాతరంగముల్
చుట్టుకొనన్ వెలెన్ భువనచోద్యముగా భయదంబుగా మహా
దిట్టతనాన సభాభవన ఢీంకృత భీమనృసింహ రాడ్ఘటా
ఘాట్టమహాట్టహాస చతురాననముద్భ్రమ కుంఠితత్రిణీ
పట్టణరోషజాలహృత కుంఠితకంఠగభీర నాదసం
ఘట్టవిజృంభమాణగతిఁ గావలెదీవన పద్యమిచ్చిచే
పట్టితినామణీకనకభాజన భూషణ భాసురాంబరా
రట్టతురంగ గంధగజరాజ దమూల్యసుగాత్ర పత్రిభూ
పట్టణభర్మసౌధ్య ఘటపంక్తి చిరాయుః నామయంబులై
గట్టిగఁ దోషతో వెలయఁగావలె నెన్న, వచింపఁ జాలుఁడే
యట్టిటు మందనేలముల నంతఋణంబలెఁ జుల్కఁ జూచి యే
పట్టుననైనఁ గీడము పల్కఁ కులీఁడీ పయిపెచ్చునంచునన్
గొట్టను దుష్కవి ద్విరదకోటులఁ బంచముఖోద్భటాకృతిన్
జెట్టుదు దండముల్సుకవి బృందముకే నతిభక్తి సాదరన్
గట్టితిముల్లెలేఁదియుగాఁ గల నాబంబదాతు వెమ్మ్యదన్
రట్టఁకి రామకృష్ణ కవిరాయుని మార్గమెఱుంగ నిక్కతిన్."

అని పఠింపఁగా నతఁడు భయపడి గోనేడ గ్రామము నగ్రహారముగా "బుధజనాటవ్య న్యంకు బచ్చి వెంకు"న కిప్పించి వైచెనట. అంతట రామకృష్ణకవి సంతసించి తిమ్మరుసు సింహాచలస్వామి కొసంగిన యుపహారములను గూర్చి యొక శ్లోకమునురచించి దానిని శిలాశాసనమునందు జెక్కింపఁజేసెనట

శ్లో॥ శాకాబ్దే బహుధాన్యనామని సహోనేత్రాబ్ధి చంద్రాన్వితే
కార్తిక్యాం శశివాసరే శుభతిథౌ సింహాచలస్వామినే
హారం కర్ణవిభూషణే పకటకే శ్రీకృష్ణరాయాధిపా
మాత్యో రచయ నెశ్వ తిమ్మనృపతిః ప్రాదాద్విజద్భాస్త్రగ్రీః ॥

అప్పటినుండియుఁ దిమ్మరసు రామకృష్ణు నాదరణబుద్ధితోఁ జూచుచు గౌరవించు చుండెను.

---

## —: జుట్టునకు హంసపాదు. :—

తిమ్మరసు మంత్రి ప్రాయికముగా హంసపాదులు పెట్టుచు వ్రాతలు వ్రాయునలవాటుగలవాఁడైయుండెను. పెద్దనమంత్రి వ్రాసిన వ్రాతలు శుద్ధప్రతులు వ్రాయువ్రాయసకాండ్రకు మిక్కిలి కష్టముగా నగపడుచుండెను. ఒకనాఁడు వ్రాయసకాండ్రు రామకృష్ణుని యొద్దకేతెంచి మా మంత్రిగారు తమవ్రాఁతలో హంసపాదులు పెక్కులు వ్రాసి మఱియొక చోట నందు వ్రాయఁబడవలసిన యంశములను వ్రాయుచుందురు. ఆ సంగతి యిచ్చట నేయే విషయములను వ్రాయవలయునో యది తెలిసికొనుట బహు కష్టతరముగా నున్నది. మే మీ విషయ మాయనతో ననుటకు వెఱచెదము! ఎట్లయినను మా బాధ నివారణచేయింపవలెనని రామకృష్ణుని వేడుకొనిరి. రామకృష్ణుఁ డందులకు సమ్మతించి మఱునాఁడు తనతలపంతయు గొఱిగించి నైచుకొని గడ్డమునందొక హంసపాదువలె నుండునట్లుగ నొన్ని రోమములనుంచి చంకయందు క్షౌరము చేయించుకొనక రాయల యాస్థానమునకరిగెను. తిమ్మరసు మంత్రియును వ్రాయసకాండ్రును కవీశ్వరులును సభాస్థలి నలంకరించియుండిరి. రాయలు రామకృష్ణుని వంకఁ బరికించి చూచి, ఇదియేమి రామకృష్ణా! గడ్డమునందు గొన్ని రోమము లుంచి క్షౌరము చేయించుకుంటివేమి? మంగలవానికి చేతనయినది కాదా? లేక యట్లు చేయింపఁ దలఁచితివో చేయించితివా? యని యడిగెను. రామకృష్ణుఁ డిందుకు నయ్యా! మంగలివాఁడు క్షౌరముఁ జేయుచు పొరపాటున నా పిలక జుట్టు గొఱిగినైదినాఁడు

ఏమ్మాట నే నేమి వానిని శిక్షించెదనో యని భయముచేత గడగడ వడఁకుచు, "బాబూ! పొరపాటున జుట్టు గొరిగివైచితిని, నన్ను క్షమింపుఁడని నా పాదములపైఁబడి యేడువఁదొడఁగెను. వాని నేమి యనుటకును నోరురాక, వానితో "నోరీ భయపడకుము. రాజ్యచక్రముం ద్రిప్పు తిమ్మరుసు మంత్రిగారంతవానికే పొరపాటులుండఁగా నీకు పొరపాటు గలిగినదనిన నాశ్చర్యమేమియున్నది? గడ్డముపై హంసపాదు నుంచి యీ జుట్టును చంకలో దిగఁగొట్టువేయు మంటిని వాఁడట్లొనరించెను. ఇంకను చూచుకొనుఁడు చంకలో నుంచినాఁడని చూపించుచు రాజ్యచక్రముం ద్రిప్పు తిమ్మరుసు మహామంత్రి యంతటివాఁడే పొరపడి హంసపాదులుంచి వ్రాతలు వ్రాయుచుండఁగా మూర్ఖుఁడగు మంగలివాఁడు మాత్రము పొరపడినచో గడ్డముపై హంసపాదు పెట్టుకొని మఱియొక చోట దాని నగపఱుపఁగూడదా యని సమాధానముం జెప్పెను. రాయలును తిమ్మరుసును రామకృష్ణుఁడొనర్చిన యుక్తికి మెచ్చుకొని యప్పటినుండియు వ్రాత వ్రాయునప్పుడు సరిగా వ్రాయవలయునే కాని ప్రాయికముగా హంసపాదులుంచినచో వ్రాతగాండ్రకుఁ జాల గష్టతరముగా నుండునని తెలిసికొనిరి.

---

## —: నెల్లూరు నెరజాణ :—

శ్రీకృష్ణదేవరాయల కాలాకాక సమయమున నెల్లూరునందు ప్రౌఢలును, యుక్తిగల నెరజాణలును, అప్రతిహత క్రియావాక్పటిమ శీలురు నగు వేశ్యలు పెక్కండ్రు గలరని తెలియవచ్చెను. అట్టి వారాంగనల నెరజాణతనము నాలోకింప నిచ్ఛచే తన్నగరికి ప్రయాణసన్నద్ధుఁడాయెను. తిమ్మరుసుమంత్రి రాయలయాంతరంగికను

తొంగిన వాఁడగుటచేతను, యాతని రాయలు పితృసమానునిగా జూచుకొనుటచేతను అట్టి ప్రమాణమువలన దేవరవారి కపనింద వాటిల్లునని చెప్పి యాతని వారించెను. రాయలు దాని సమ్మతించెను. కాని యాతని మానసమున వానిం బరీక్షింపవలయునను నిచ్ఛగలిగి యుండెను. కావున రాయలు రామకృష్ణునిబిలిచి నెల్లూరునందుగల వేశ్యల జాణతనముం జూచుటకై యాతని ప్రయాణ సన్నద్ధుంగాం జేసెను. అతఁడందులకు వల్లెయని మొట్టమొదట నెల్లూరు మూఁడవదినమునకు చేరెను. అతఁడు నెల్లూరుసత్రముచేరునప్పటికి మధ్యాహ్నముకావచ్చెను. అందుచే నతఁడొకసత్రమున నతిప్రయాసతో జేరెను. బియ్యము మొదలుగాగల భోజనసామగ్రి చేకూర్చుకొనెను. కాని కూరలోనికి పోపుపెట్టుటకు నూనె మాత్రము లేమింజేసి సమీపమున నున్న నొక తెలికలవాని యింటికుంబోయి యొకదుగ్గాని నూనె నిమ్మని యడిగె. నూనె తీసి కొనిపోవుటకు పాత్రలేమింజేసి యతఁడు తైలిక(కేలు) యొక రావియాకు దొప్పలోపోసి యిచ్చెను. అది మార్గమధ్యమున సుడిగాలిచే [illegible] పోబడెను. అంత మరల నా తైలికునొద్దకుంబోయి, యీయూనె నీవు పోసినయూనె మార్గమధ్యమున సుడిగాలిచే నొలికిపోయినదని నుడివెను. అందులకా తెలికవాఁడు నీకొఱకేపోయినదిలే యని, బదులు చెప్పెను. అంత తెనాలిరామలింగడు కోపముచే నచ్చటనున్న నూనె జాడీలన్నిటిని వంచివైచెను. అందుల కాతఁడు కోపించి యీయూనెనంతయు నిష్కారణముగ వంచివైచితివి. దానిమూల్యము నిచ్చితేగాని నిన్ను పోనివ్వనని పలికెను. అంత రామలింగడు పోనీ నీకొఱకే పోయినదిలేయని నుడివెను. తెలికలవాఁడు న్యాయాధిపతి యొద్దకు రామకృష్ణునిం గొంపోయి ఫిర్యాదు చేసెను. రామకృష్ణుఁడు జరిగినవృత్తాంతమంతయు విన్నవించెను. చెప్పినదానితో రామకృష్ణుని కవియు

నియమములతో వచ్చినవారినెల్ల నోడించి ధనమార్జించుచుండెను. సౌదామిని గర్వాయత్తచిత్తయై మాటలందును వాదములందును తన్నోడించువారి కొకలక్షవరహాలు బహుమానమిత్తునని ప్రకటించెను.

ధనాశాపరులైన పలువురట కేతెంచి యామెచే నోడిపోవుచుండిరి. రామకృష్ణుఁడొకనాడీ యుదంతమును విని యొక బోయవాని వేషమును దాల్చి కట్టెలనమ్ముచు నా సౌదామినిగృహసమీపమునకు వచ్చెను. అంత సౌదామిని బయటకు వచ్చి కట్టెలెంత కమ్మెదవని యడుగ వాఁడు పట్టెడు మెతుకులకని బదులుచెప్పెను. సౌదామిని యందులకు సమ్మతించి దొడ్డిలో కట్టెలను పడవేయుమని చెప్పెను. రామకృష్ణుఁడు కట్టెలను దొడ్డిలో పడవైచెను. సౌదామిని పట్టెడన్నముం బట్టుకొనివచ్చి రామకృష్ణుని కీయబోయెను. రామకృష్ణుఁడు "అమ్మా నాకు పట్టెడు మెతుకులనగా ఒకమెతుకే పట్టెడుండవలెనుగాని నాకీ యన్నము పనికిరాదు. అట్లు పెట్టలేని యెడల నీవు నా మాట కోడినట్లు కావున నీ ప్రకటన ప్రకారము సొమ్ము నాకిమ్ము" అని పలికెను. అంత సౌదామిని యా బోయవానిం జూచి "యీతఁడు సామాన్యుఁడు కాఁడు ప్రచ్ఛన్నవేషధారి యగు మహాత్ముఁడని తలపోసి యాతని వృత్తాంతమంతయు సవిస్తరముగా దెలిసికొని తాను ప్రకటించిన ప్రకారము లక్షవరహాలు నిచ్చివేసెను. ఈ జయమును గూర్చి రాయలకు తనంతనే రామలింగఁడు తెలియపరచెను.

---

## —: ప్రత్యక్ష పురాణము :

నెల్లూరునందు ప్రభావతియను వేశ్యాంగన కలదు. ఆమె పురాణశ్రవణమునందతి యాసక్తి గలది. అందుచే ప్రభావతికి పురాణపండితు లనుదినముగా గలరు. పండితులెవ్వరా పురాణమెంచినను ప్రభావతి

వారిని రావించి ప్రత్యక్షపురాణము జెప్పగలరాయని యడుగుచుండె డిది. వారందఱును దమవలన కాదని నుడివిపోవుచుండిరి. ప్రత్యక్ష పురాణముం జెప్పగలవారికి వేయివరాలం బహుమానముసంగెదనని పరిభావతి పురమంతయు చాటింపించెను. పండితులెవ్వరును యూరక యుండిరి. అంత తెనాలి రామకృష్ణుం డెట్లో యీసంగతి నెరిగి మరు నాడుదయమున నిజముగు పౌరాణికుని వేషముంబూని గొన్ని దాటి యాకుల గ్రంథములు జేతందాల్చి పరిభావతి యింటికేతెంచెను. ఆమె వీథియరుగుమీద నిలువబడియుండెను. పరిభావతి రామకృష్ణునింగాంచి పూజించి యొక యుచితాసనమున కూర్చుండబెట్టెను. పరిభావతి యాతని కుశలప్రశ్నలంజేసి మీ రేయే పురాణములంజెప్పగలరని యడి గెను. అంత రామకృష్ణుండు ప్రత్యక్ష, అభినవ, అభినయ, యదార్థాంత రన్యాస, ఆకాశ, ఆలంబన, వికట, విశేష, ప్రల్లవ, భాండభిన్న మొద లగు పదునెనిమిదిపురాణములం జెప్పగలనని బదులుచెప్పెను. పరిభా వతి మీరీ రాత్రి యీప్రత్యక్షపురాణముంజెప్పి నేచాటించిన ప్రకా రము బహుమానముం గైకొనవచ్చునని రామకృష్ణునితో చెప్పెను. అతడు సరియే రాత్రివచ్చెదనని చెప్పివెడలిపోయెను. పరిభావతి పురాణ మైనపిదప యెట్టిటో మాటలతో మోసపుచ్చి బహుమాన మొసంగ కయే పండితునిపంపవలెనని నిశ్చయించుకొనెను. రామకృష్ణుడు తగు దుస్తులను ధరించుకొని యామె గృహమునకేగి యేకథ ప్రత్యక్షపురా ణము గావింపమనియెదవని యడిగెను. పరిభావతి రామాయణమున సుందరకాండ బహుసుందరముగా నుండునని చెప్పెను. అంత రామ కృష్ణుం డొక మంచము నెక్కి ఆంజనేయుడిట్లు మహేంద్రపర్వతముపై దుమికెనని రెండవ మంచముపైకురికెను. పిమ్మట మైనాకపర్వతముపై నట్లు నాంజనేయుడు నిలబడెనని తానామంచముపై నిలువబడెను.

తరువాత నాంజనేయుడు సముద్రములంఘించినట్లు మంచముపైనుండి పందిరిపై కురికెను. ఆవల కపిశ్రేష్ఠుడు లంఖిణిం బొడిచెనని ప్రభావతి గుండెలపై గుద్దెను. పిమ్మట వాయుసూనుడు లంకంగాల్చినట్లు తానా వారాంగన యింటియందలి గుడ్డలనెల్ల తగులబెట్టెను. ఉపకారము తోకచల్లార్చుకొనెనని యా యింటిలోని నీరంతయు నోడలిపై బోసుకొనెను. అట్లా గృహమంతయు మహాభీభత్సముగాజేసి రామకృష్ణుడటనుండి వెడలిపోయెను. పిమ్మట ప్రభావతిని న్యాయాధికారియొకుంజని మొరలిడగా రామకృష్ణునివలన యాతడు కలనిజమంతయు నారసి ప్రభావతిని శిక్షించెను. రామకృష్ణుడు నెల్లూరునుండి విజయానగరమునకుంబోయి రాయలనుసందర్శించెను. రాయలు రామకృష్ణుని రాకకై యువ్విళ్లూరు చుండుటచే నాతనిజూచి యమితానందము బొందెను. అంత రాయలు నెల్లూరు నెరజాణల సౌందర్యాతిశయము నభివర్ణింపుమని కోరగా నాతడు వారిని చూచివలెనే కాని వర్ణింపలాభములేదు. వారు దేవతాస్త్రీలను బోలియుందురని నుడివెను.

సీ॥ మొలకచీకటి జల • జలరాల్పగారాదె
నెరులుమించిన వీరి • కురులయందు
కెరలించి యమృతంబు • గిలకొట్టఁగారాదె
ముద్దుచూపెడి • వీరి మోములందు
పచ్చబంగారు కు • ప్పలుసేయఁగారాదె
గబ్బుమీరిన వీరి • గుబ్బలందు
పండువెన్నెలతేట • బంధింపఁగారాదె
నగవుగుల్కెడి వీరి • మొగములందు
నౌర! కరవాఁడి చూపుల • యాఘుశంబు
చూపురే! ఘూటికటి కటీ • భారమహిమ

జాలు మదగజ గమనల ♦ క్షణములర!
నేర్పుమించెద రప్పూరి ♦ వారసతులు.

అని వర్ణించి చెప్పెను.

—: మామిడిపండు :—

శ్రీకృష్ణదేవరాయలు తల్లియగు నాగాంబ చనిపోవునపుడు తనయునిం జూచి మామిడిపండ్లను దినవలెనని యున్నదిఅనెను. అందుచే నది అశ్వయుజమాసమైనను, మామిడిపండ్లు దొరుకు టరుదుయైనను దుకాణములలో తేనెలోనుంచి దాచిన మామిడిపండ్లనైన దీసికొని రమ్మని రాయలు సేవకులను బిలిపించి పంపించెను. వారు విపణివీధంతయుదిరిగి చిట్టచివరకు నొకదుకాణమునినుండుట దెలిసికొని యచ్చట నున్న మామిడిపండ్లన్నియు దెచ్చిరి. కాని వారుపండ్లను దెచ్చునరికి రాయలుతల్లి స్వర్గస్థురాలయ్యెను. రాయలు, తల్లియడిగినవి తెచ్చిపెట్ట లేకపోతినిగదా యని విచారింపదొడగెను.

రాయలగురుపురోహితుడగు తాతాచార్యులవారు మీరు మీతల్లి పేరుచెప్పి బ్రాహ్మణులకు బంగారుమామిడిపండ్లను దానమొసంగిన చో నామెకందగలదని రాయలతో మనవియొనర్చెను. అందుల కాతడు సంతసించి వల్లెయని యేటేటను యామెపేరుజెప్పి బంగారు మామిడి పండ్లను కోటానకోట్లు బ్రాహ్మణులకు దానమొసంగుచుండును. ఇది యష్టదిగ్గజములనంబడు కవీశ్వరులందరును గుర్తెరిగి రామకృష్ణునితో "రామకృష్ణా! రాయలు చాదస్తముచే ధనాగారమంతయు సువర్ణ మామ్రఫలదానములకై ఖాళిజేయుచున్నాడు. కావున నీవెట్లయిన నది మాన్పింపవలె" నని చెప్పిరి. రామకృష్ణుడు వల్లెయనినుడివెను. నాగాంబ తిథి ప్రయోజనదినమున రాయలూరంతయు బంగారుమామిడిపండ్లను

దానమిచ్చునని చాటింపించెను. కోటానకోట్ల జనులా రాయలయాస్థానమునకు సువర్ణములనాసించి వచ్చియుండిరి. అంత రామకృష్ణుడా బ్రాహ్మణులందఱ నొకదొడ్డిలోనికి బోనిచ్చి యచ్చటనొక కమ్మవానిచే నొకకొలిమి గాల్చిపెట్టించి వానితో మీరందఱు నెన్నివాతలు పొందిన నన్నిమామిడిపండ్లు పొందగలరని నుడివెను. అంతవిప్రులందరు భయాతురులై తప్పించుకొని రామకృష్ణునిచే నొక్కొక్క వాతనేపొంది రాయలిచ్చిన మామిడిపండును గైకొని వెడలిరి. ఒక మొండివిప్రుడు రెండు వాతలంబడసి రాయలను రెండు పండ్లనడిగెనురి రాయలదివిని యేమి కారణమని యడుగగ రెండు వాతలం జూపించి జరిగిన యుదంతమంతయు నుడివెను. అప్పుడు రాయలు రామకృష్ణుని బిలిపించియడుగగ "దేవా మాయమ్మ చనిపోవునపుడు వాతంబనుగుచు వాతరోగముచే జచ్చ[illegible]వున ఆమెసంతుష్టికొరకు వాతలనువేయుటకు నాకు సహాయులు చిక్కిరి నేడాపని గావించితిని" అని నుడివెను. అందులకు రాయలు [illegible] మరలింమబుకై జేసెనని సిగ్గుపడి యూరకుండెను. కానీ బ్రాహ్మణులకు వాతలంబెట్టినను కోపమునను తలారులబిలిపించి రామకృష్ణు నొకగోతిలో శిరముపైనుంచి మిగిలిన దేహమంతయు గప్పిపుచ్చవలెనని శాసించెను. అంత వారాతనిని శ్మశాన వాటికకుంగొనిపోయి యచ్చట గప్పివుచ్చిరి. రామకృష్ణుడటనుండి తప్పించుకొను ప్రయత్న మూరయుచుండెను. ఇంతలో నొక గూను చాకలి యాదారింబోవుచుండ రామకృష్ణుడు వానిగాంచి నీవొక దినమీ గోతియందుండిన నీగూనంతయు దీఱిపోవును. నేను నిన్నటినుండి నిందుంటిని నా గూనంతయు పోయినది అనిచెప్పి వానిసహాయమున నా గోతినుండిలేచి వానినందుంచి తప్పించుకొనివచ్చి రాయలను సందర్శించెను. రాయలు రామకృష్ణుని యుక్తికి మెచ్చుకొనెను.

## —: గుఱ్ఱములను పెంచుట :—

క్రిస్తోవా ఢోఫిగరీస్ యనుపోర్చుగీసు రాయబారి రాయచూరు ముట్టడి యనంతరము తన దేశమునకుం బోయి తిరిగి గొన్ని గుఱ్ఱములను దీసికొని విజయనగరముం జేరెను. అందు కొన్ని గుఱ్ఱములను రాయలు కొని యవి తన యుద్యోగస్తులకిచ్చి పెంపుడని చెప్పెను. అందరు తల యొక గుఱ్ఱమును గైకొనిరి. రామకృష్ణు డొక గుఱ్ఱమును గైకొని నొక చావడియందుంచి దానిని నాలుగు గోడలు మూయించి మేతకై నొక కన్నము మాత్రముంచెను. కొన్ని గడ్డిపోచలు మాత్రము ప్రతిదినము రామకృష్ణుడు గుఱ్ఱమునకు మేత వేయుచుండెను. తిండిలేక కొన్నిదినములకు గుఱ్ఱమస్థిపంజరమైయున్నది. కన్నమునుండి చూచినవారినెల్ల కొరికివైచుచుండెను. రెండు నెలలయిన పిమ్మట రాయలు యెవరిగుఱ్ఱములు వారు తీసుకొనివచ్చి చూపుడు బాగుగా బలిసినగుఱ్ఱముకలవానికి బహుమానమిచ్చెద"నని నుడివెను. అందరును వారివారి గుఱ్ఱములను చూపిరి. కాని రామకృష్ణు డూరకయుండెను. అపుడు రామకృష్ణుని గుఱ్ఱము చూపమని యడుగ "దేవా అది మిక్కిలిబలిసిపోవుటచే యెవరికిని సాధ్యము కాదు. వచ్చినవారినెల్ల కరచుచున్నది. అందుచే దానినొక చావడిలో నుంచి మేతకు కన్నముతప్ప మిగిలిన నాలుగువైపుల మూయించితిని" అని చెప్పెను. రాయలాశ్చర్యపడి యశ్వశాస్త్రవేత్తయగు తురుష్క సేనానిని పిలిపించి యాయశ్వమును జూచిరమ్మనెను. అతడా కన్నమునుండి చూచుసరికి యాతని నెరసినగడ్డమును గడ్డిపోచలనుకొని లాగివైచెను. అతడుకూడ రాయలు వద్దకుం జని గుఱ్ఱము చాలబలిసియున్నదనియు తన గడ్డమును లాగివైచిందనియును అందరను కరచుచున్నదనియును చెప్పెను. అంత రాయలుస్వయముగా బయలు దేరి సేవకులచే నాలుగుగోడలు బ్రద్దలుగొట్టించి చూచుసరికి గుఱ్ఱము

యొక్క యస్థిపంజరము ప్రత్యక్షమాయెను. రామకృష్ణుని యొక్క మోసమునకందరును యద్భుతమంది యేమిది యని రామకృష్ణుని యడుగ నాతఁడు బలికి యందరను కరచుటచే గుఱ్ఱమును నాగదిలోనుంచి నాలుగువైపుల మూసి వైచితిని. అందుచే తిండిలేక బెంగతో నిట్లయినదని సమాధానమొసగెను. అందుల కందరును నవ్వుకొనిరి.

---

## —: సోమనాథభట్టు :—

రాయల యాస్థానమందు గ్రామపురోహితుడు సోమనాథభట్టను నాతఁడు కలఁడు. ఆతనిభార్య సోదెమ్మ. సోమనాథభట్టు తెల్లవారుజామున మూఁడుగంటలకు బయలుదేరి ఊరియందలి శుభాశుభముల నారసి యెచ్చటనో భుజించి సాయంకాల మింటికి చేరుచుండెడివాఁడు. సోదెమ్మ భర్త లేని సమయమునను స్వేచ్ఛానువర్తియై యామె యిచ్చవచ్చినచొప్పున వర్తించుచుండెడిది. ఆమె జారిణి. ఒకనాఁడా సోదెమ్మ రామకృష్ణునిఁజూచి మానసమాతనిపై నుంచెను. ఆతని యింటికేగి నమృతతుల్యములగు వాక్కులచే నాతని లోఁగదీయఁజూచెను. కాని యాతఁడు పరస్త్రీవర్జితుఁడగుటచే సోదెమ్మకు లొంగలేదు. సోదెమ్మ తన వాంఛితమును కూడ రామకృష్ణునికి దెలియపరచెను. కాని యాతఁడు సోదెమ్మకు చాలనీతులును బుద్ధియుజెప్పి అట్టి మనోభీష్టము చాల తప్పనిచెప్పి వారించెను. సోదెమ్మ భర్తయం దసహ్యతచే నాతని విడచి నీళ్లబిందెను దీసుకొని కాలువకేగి యట బిందె విడచి కల్బురగీపురమునుజేరి వేశ్యావృత్తి నవలంబించెను. ఊరివారందరును సోదెమ్మ చనిపోయినదని యనుకొనిరి. సోమనాథభట్టుకూడ నట్లే తలచి యామెకు కర్మచేసి రెండవభార్యను సావిత్రి యను నామెను పెండ్లియాడెను. సావిత్రి కాపురమునకువచ్చి గర్భవతియయ్యెను. గాని

సోదెమ్మ పట్టుకొన్నదనియు అందుచేతను గర్భమందలిశిశువును నడతినివైచుచున్నదనియు చెప్పుచుండిరి.

ఒకానొకప్పుడు రాయలు కల్బరగీపురమును ముట్టడింపబోగా నటకు రామకృష్ణుడుకూడ నేగెను. అంత సోదెమ్మ రామకృష్ణుని యొద్దకుబోయి తనస్థితిని నాతనితో జెప్పి యాపురి సుల్తాను యొక్క మర్మములనుజెప్పి వారికి జయము సమకూర్చెను. రామకృష్ణునితో మరల విజయనగరముం జేరెను. తనకు జయముగూర్చిన దగుటచే రాయలామెకు భోజనవసతుల నేర్పాటుచేసెను.

ఒకనాడు రాయలాస్థానమునకు రామకృష్ణుడు సోమనాథభట్టును, భార్య సావిత్రిని రావించి వారికి సోదెమ్మనుజూపి యట్టి దయ్యపుభయము వారించెను. అంత సావిత్రి సంతానవంతురాలై సుఖముగ భర్తతో కాలముగడపెను. దీనివల్ల తెనాలి రామకృష్ణుని పరోపకారత్వమును, యేకపత్నీవ్రతత్వమును, సుగుణగణమును తెలియపరచుచున్నది.

—: ముగింపు :—

అశేషశేముషీధురంధరుడగు తెనాలిరామకృష్ణకవి చరిత్రము వ్రాయుట మిక్కిలి దుష్కరము. మనుచరిత్రము, పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద, పాండురంగ మహాత్మ్యము, ఘటికాచల మహాత్మ్యము మున్నగు గ్రంథములయందెంతవెదకినను చరిత్రము వ్రాయుటకుం దగినంతటి యాధారము లెవ్వియుం గానరావు. విదేశస్థులవ్రాతలకును మనపూర్వీకులవ్రాతలకును కాలనిర్ణయమునందు బరస్పరవిరుద్ధములు కాన్పించుచున్నవి. మన గ్రంథములలోనైనను నొకదానికొకటి సందర్భము కుదురుటలేదు. ఏదియెట్లున్నను రామ

కృష్ణకవి క్రీస్తుశకము పదునారవ శతాబ్దము చివరను బదునారవ శతాబ్దము మొదటనుండి యున్నాడనుట నిర్వివాదాంశమై యున్నది. నాచే నిందువ్రాయబడిన రామకృష్ణుని హాస్యకథలు యథార్థములా? కల్పితము లాయని కొందఱూహింప వచ్చును. ఇవి యన్ని విషయములుంగాని, యిందలి కొన్ని విషయములుగాని, యదార్థములు కావని తగినంత తృప్తికరములైన నిదర్శనము లగుపడునంతపర్యంతము నివి యన్నియు యదార్థములేయని మాచదువరులు నమ్మెదరుగాత. ఇట్టి విద్వాంసుండును, మహాకవియు, నింతటియుక్తిపరుండును, గుణాలంకరిష్ణుండును, సజ్జన శ్రేష్ఠుండును, సాధువర్తనుండునునగు తెనాలి రామకృష్ణునిచరిత్రము సంతతానంద దాయకమై యాంధ్ర మహాశయుల హృత్పద్మ పీఠములయందు సర్వదా యధిష్ఠించి యుండుగాత.

గద్య:—ఇది శ్రీమద్వీరభద్ర దేవదేవ కారుణ్యలబ్ధకవిత్వ వైఖరీసురీణ మల్కాపల్ల్యాన్వయపవిత్ర రామనామాత్య పౌత్రజగన్నాథామాత్య పుత్రవిబుధ విధేయ పెదశేషగిరిరాయనామధేయ ప్రణీతంబయిన తెనాలిరామకృష్ణ చరితంబను గద్యకావ్యంబునందు సర్వంబును నేకానువాదము.

శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ. శ్రీ. శ్రీ..

# అనుబంధము.

రామకృష్ణునిచే రచియింపఁబడిన

మఱికొన్ని చాటువుల నిందుఁ బొందుపరచడమయినది.

తే. గీ. అతివ కచనాభి జఘన దేహాననముత
మీనదరసాలతారాజపానిరాక
రణమనంతమనాదినేత్రగళభుజన
ఖోష్ఠకుచవచోదంతము లుభయగతుల.

అతివ=(ఈ) స్త్రీయొక్క, కచ=కొప్పున్ను, నాభి=బొడ్డున్ను జఘన=పిరుదులున్ను, దేహ=ఒడలున్ను, ఆననము=ముఖమును, (ఇవివరుసగా) అనంతము=చివర యక్షరము (హా) లేకుండఁగా నంటినయెడల; తమీ=చీకటినిన్ని, నద=ఏరునిన్ని, రసా=భూమినిన్ని, లతా=తీగెనున్ను, రాజ=చంద్రునిన్ని, నిరాకరణము=నిరాకరించును, అనాది=మొదటిదియగు ("త" యను నక్షరము) లేకున్నయెడల నేత్ర=కన్నులున్ను, గళ=కంఠమున్ను, భుజ=భుజములున్ను, నఖ=గోళ్ళున్ను ఓష్ఠ=పెదవులున్ను, (ఇవి వరుసగా) మీన=చేపలనున్ను, దర=శంఖమునున్ను, పాల=పండ్లనున్ను, తారా=నక్షత్రములనున్ను. జపా=మంకెనపుష్పములనున్ను నిరాకరణము=నిరాకరించును ఉభయగతులన్=రెండువిధములచేతను, (అనఁగా మొదటిదియగు "త" యున్ను, చివరగు "హా" యున్ను కలిపివేసిన యెడల) కుచ=ఉరోజములున్ను, వచ=వాక్కులున్ను, దంతములు=దంతములున్ను, (ఇవి వరుసగా) తమీనద=నదులయుత్పత్తిస్థానములగు పర్వతములనున్న, రసాల=తియ్యమామిడిపండ్లనున్ను, తారాజపా=దిరిసెనపుష్పములనున్న నిరాకరణము=నిరాకరించును, అనఁగా పైపద్యమునందలి మొదటియక్షరము విడిచి, యర్థము జెప్పినచో నీ స్త్రీయొక్క కొప్పున్ను మొదలైనవి, చీకటి మొదలయిన వానిని నిరాకరించుననియుఁ జివరయక్షరము విడిచి యర్థముఁ జెప్పినచో, కన్నులు మొదలయినవి, చేపలు మొదలైనవానిని నిరాకరించునని, రెండును విడిచిపెట్టకుండగ మంచి యర్థముఁ జెప్పినచోఁ గుచములు మొదలైనవి, పర్వతములు మొదలైనవానిని నిరాకరించుననియుఁ గవి యలంకారములో వర్ణించినాఁడు.

తే. గీ. పల్లవంబూని, సకియమేనెల్లఁ జేసి
పద్మగర్భుఁడు లాదీసి వాగుడిచ్చి

బూని సర్జించి, యప్పుడప్పుడు బోఁడి,
డెందమునరించె నందేహ మొందనేల. 2

క. విధుకృతకదనము వదనము,
మధుకర నికరము లఁగేరు మగువచికురముల్
విధుమధుకర లీలాజయ
మధురోక్తులు పిక్కఁకారె మధురాధరకున్. ౩

క. తారకములఁ గోరకముల
వారకములకెల్ల నెల్లవారకములిడున్
శ్రీరమణీ హారసుతీ
భారమణీయ త్వదీయ పదనఖరంబుల్. ౪

సీ. ఘనకేశియనినీవు చెనకు రాకు సమీర
భుజగరోమాళి యీపువ్వుఁబోఁడి
మీనాక్షియని మేరమీఱకు కోకంబ
చంద్రికాహాస యీ చంద్రవదన
బింబోష్ఠియనిచో బెదిరింపకు శుకంబ
సాంకవామోద యీసన్నుతాంగి
కంజాస్యయనిచో గలవాంచకుఁ మృగాంక
స్వర్భానుతేఁటి యీజలజపాణి
శ్వాసవక్షోజవదనా స్యబాంధవముల
బంధువులుగాన మీకుఁ జెప్పంగవలసె
నిట్లు వినకున్నఁ జెప్పులని మటుయొరిగి
పడుట, వదరుట, కొంకుట, ఫలముసుమ్ము. ౫

క. జలచరము మిడుతమ్రింగెను
జలచరమును మ్రింగె నుడుత జగతీస్థలిలో

వలరాజు రాజుమిగిలెను
వలరాజును రాజుమిగులవచ్చినపడియెన్. ౬

వ. సతీశుచవాక్సమత్వమరిజాత సుధల్ గొనఁబూని వాదుకై
హాతులయి వారిజాత వసుధాకృతులూనియు దృష్టితంబు ని
ర్జితరుచిఁగాంచియున్ దుదినర్పితముం బొందినఁ జంద్రసేవధి
స్థితిని, ముఖాంగముల్గలిచె సీతగదిన్నిట నొంటినోడినన్. 7

తే॥ గీ॥ తామరవిడారుకొమ్మ నెమ్మోమునకును,
సాంద్రచంద్ర చంద్రస్ఫూర్తి సాటియగునె
నాతినలమిన్న చెక్కిలి వాతెఱకును
సాంద్రచంద్ర చంద్రస్ఫూర్తి సాటియగునె? ౮

శా. సాధితరాధి రాధ రథిసాధితదీధిత పూర్వనీయ స
ద్రాధిత నాధినాధితసదారిత రారి తరారిరైరిశు
భ్రా; తనాథ నాయతర భారతపూరితవారితాంబుధి
స్ఫూధిత సాధులోక సనుపూజిత రాజిత పూర్వశేఖరా. ౯

చ. శరశర కాండకాండ హరి చందనచందన నాగనాగ సుం
దరదర చంద్రచంద్ర శితనారద నారద తారతార భూ
ధరధర రాజరాజ హయదాన వదానవకాశకాశ స
త్పుర పుర మానమానహర భూధరభూధర కాలకాలహా. 10

క. కమలాకర కమలాకర
కమలాకర కమలకమల కమలాకమలా
కమలాకర కమలాకర
కమలాకరమైన కొలను గాంచిరి సుదతుల్ 11

క. జలకలకల కలకలకల
జలద కలాజలజముఖుల జలములకవయో

వదనకుంతలయాన నుస్వరనఖత్వ
మొనసియుండిన కతన మీాకితవౌనర్చు
ననుచు నళిచంద్ర పరభృత్ హంసములకు
భయము నయమును దెలియంగఁ బలికె మతి యు. 19.

మ. బలవద్దర్పక శస్త్రికానిహతిసైపక లేక యవ్వేళ న
య్యళి నీలాలక యంబరాంత పరిధీతాత్మీయ భిన్నాననో,
త్పలినీ బాంధవయామనేచ్ఛఁ గనుభూపాలైక రాగంబునన్
గలకంఠీ కలకంఠ కంఠనినదైక్య స్ఫూర్తి శోభిల్లగన్. 20.

చ. అలఘన చంద్రబింబ నిభమైతగుఁగాంత మొగంబు; దానిలోఁ
గలిగినయర్థభేదములఁగైకొని చెప్పఁగనొప్పకొప్పు; చె
క్కులు రదనాంశుకంబులవి గుబ్బలకున్ సరిరాకపోయె; చే
తులు సరియయ్యె; దానిగతిఁదోచెను పొంకపుఁటూరు దానికిన్. 21

ఉ. ఆసలినాక్షి నేసలికి నంబాధరంబు సమంబుగా మిచే
దానిఋవ్రియ్యాలై చనిసఁదద్దశఁజూచిదయాద్రిలైబుధుల్
దానిపదాంతరంబునను దారువపించినవారుగావున్
బూనితదంశమున్ సమతఁబోల్చిరికత్పతిద్రుక్కుచంబులన్ 22

మ. సతతోత్సర్జన వాగ్ధునీసముదితస్వర్ణాద్రి రాట్కన్యకా
భ్రిత లేందిందిర డింభగుంభితయశోభ్రా జచ్ఛ తాంభోరుహా
తత విస్ఫూర్తికరోదురోః ప్రిడిమసత్ప్రాగ్రిప్రజాగ్రిన్ని జా
ద్భుత తేజోనవహేళిసంవరణ భూభృన్మౌళియొప్పున్ భువిన్ 23

చ. దరభుజగైణసింహములు తద్గళవేణ్యవలోకనద్వయో
దరములకోడి వారిధిపదంబులఁ బుట్టలపూరులన్ గుహాం
తరములబూనికొక్కఁదిన డాగసరివింపనిటూడ్పులూర్చు స
త్వరముగనేగి నీడఁగని తత్తరమంగఁగజేసితౌ హలీ. 24

శా. శైవాలంబును సైకతంబునెమ్మై చంద్రప్రవాళాంబుజ
గ్రీవాకాశభుజంగరూపములు దూరంబైననేతశ్శరీ
ఝావిద్యావిభవంబొనర్పగ దశాబ్జజ్యోత్స్నలోనర్థచం
ద్రావిర్భావముఁజూపినన్ గలిసెఁబో నాత్మే శుభావజ్ఞయై. 25

సీ. శరదంబువేణికి శాంతభావమునందె
దరహాసమడరి వెంటనెయమర్చె
మఱికంఠమొదింపఁ దిరిగిసమంబయ్యె
పిఱుఁదాదినుండిపైఁ దఱలద్రిప్పె
ననుపల్కు గలిగించి మొనమాన్చెనంతట
జంఘలుముఖభంగ సరణిమించె
పెందొడసిరితక్కుఁ బొందకసవరించె
కరములువెనుక ముందనుగఁజేసె.
తనురుచిస్ఫూర్తి సానుబంధతయొనర్చె
గతిపిసరమందె నంతరంగములు గలఁగ
నవరసప్రాప్తి యొనగూర్చునాఁడునాఁటి
కలచుచును గుత్తులీకొమ్మ కలదుసుమ్మ. 26

ఉ. అక్షరపక్షపాతముననర్థము నూళ్ళనొసంగనుబ్బుచున్
భిక్షజడాభరాధికులు భిన్ననిజప్రతులౌదురైన దు
ర్భిక్షకజాశిశుచ్యుతులు పెక్కగుభక్తియచాలుదాననా
తక్షుధితత్వమేయఘముదార్పఁడు శంకదొలంగుడీయెడన్. 27

చ. సరసిజనేత్రసీమగని చక్కనిపేరు వచింపుమన్న న
ప్పరమపతివ్రతామణియు భావమునన్ దలఁపోసి సిగ్గునన్
గరియును రక్కసుండు హరికార్ముకమున్ శరమద్దమున్ శుకం
బరుదగునీ త్రివర్ణములయంమున మధ్యనునాథుపేరనన్. 28

తే. గీ. చాననెమ్మోముగెల్చుఁ గంజాతములను
కాంతకంజాతములుగెల్చుఁ గంధరమును
కంధరంబును నమదశంఖంబుగెల్చు
శంఖభావంబునయ్యర్ధ చంద్రుఁగెల్చు. 29

చ. ఉవిదమిటారి చన్గవకుసోఁడి గుబ్బచ్ఛులీనమాను రెం
డవతనువ్రానియున్ మొదటినైజగుణంబును వీడివీఁగి మె
త్తవడిరజస్థితిన్ దోఁటగి తావిగతాశ్రియమై యుదాత్తతా
ధి వసతియయ్యెఁ దత్పటిగతించినఁ జాలకతుచ్ఛమైనన్. 30

మ. శరదబ్జాస్యక చచ్ఛవిన్ బ్రతిఘటించన్ బోయి శైవాలమూ
శరజన్మాంబుజడాశయంబులనెనా చందానవారిప్రభా
వ రసోత్కర్షకుఁ గామినిద్యమచుచున్ వాపోయివక్షోజదు
ర్గరతిన్ డాగనహీనమట్లుచట నూఁగారేచఁగాభీతిలెన్. 31

సీ. నడచెనాగండగంధకబంధమూర్త్యవే
దండతండమునటుండుండుమనును
పలికెనావల్లకీ కలకంఠకలరవ
మండితధ్వని నటుండుండుమనును
నవ్వెనాచంద్రిక నరహీరమల్లికా
డిండీరముల నటుండుండుమనును
చూచెనాపుష్పనారాచ జాతస్ఫుర
త్కాండదీధితినటుండుండుమనును
ఏమిచెప్పుదు నాయింతి కెవ్వరీడు?
అహహా! యది నీకు తిరుకేళికప్పుఁగాక
పరమభాగ్యైకశాలి! యోపాండుపారంగ!
కీర్తిశేశమునంత రవిప్రకాశ! 32

తే. గీ. కనకకుచాననగళనేత్ర కరయుగముల
కళికుభృచ్చంద్ర తరవారిజలతలోడి
పాత్రధరఁజొచ్చెను కృశించె వారిమునిఁగె
బంకమునఁజిక్కె నిడుదవై బయలకుఱికె. 33

చ. నలశశిబింబసంపదలణంచు సతీమణిపాణిపల్లవం
బులునగుమోమునారు జిగిమోవియువాక్యములును బిసాళిమీ
నులగరిమంబణంచు నరుణోష్ఠభుజంబులు మందయానముల్
నలుకలునాసికంబుతగునక్షులు నిబ్బరపుంగుచంబులుఁ. 34

చ. మృగధరబింబసంపదలమీఱు వధూటిముఖంబు వేణిచె
ల్వగునునుఁజూపుకొనుగటి యందపుఁగారుమోవి పల్కుల
జ్జిగురిపిసాళిచందములఁ బైకొను నంఘ్రిదరస్మితాక్షులుఁ
బిగిచన్నులుఁ భుజంబులును బేర్మినడల్కురులంగకంబులుఁ. 35

సీ. ధరసుధారసుధాసుధాధామకదళీ కా
డళికాళికా కారకలితమగుచు
మవరమావరమారమామాణజలవళీ
లవలీవళీలీలలమరిమఱియు
శరతుషారతుషాతుషాషారలవసితా
వసితాసితాతారఫణిసమంబు
శరదశారదశాదశాశాంతధగణభా
గణభాణభాభారగాభరంబు
ఖగముఖాగమఖాముఖాఖాగమగుచు
హరిపురారిపురాప్సరారాతనిలయ
వరసభారసభాసభాభావ్యమగుచు
యశముశముముడ మొదవ్స్రమాధిపతికి. 36

దశావతారములను వర్ణించిన పద్యముల నిందు మఱియుఁ బొందుపఱచెదము. ఇందుఁ దెనాలి రామకృష్ణుని కవితాపటుత్వము తేటపడఁగలదు.

శా. సాధీయో ముఖపూరితోద్యమితతా సత్యోర్ధ్వగోదన్వద
ర్ణోధారాంతరటత్తిమింగిల గిలప్రోద్ధాన నిధ్యానల
బ్ధాధీశప్రభుతా స్వభాగ హరణార్థాయాయినాథానుజ
ప్రాధాన్యాతివిలోలవాగ్దృగబల బ్రహ్మన్ స్తుమః స్త్వామనుః

టీక. సాధీయః = శ్రేష్ఠమైన, ముఖ = ఆననముచేత, పూరిత = నిండింపబడి, ఉద్వమితతా = పైకి వెడలఁగ్రక్కఁబడుటచేత, ఆసత్య = సత్యలోకము పర్యంతము, ఊర్ధ్వగ = పైకిబోయినట్టి, ఉదన్వత్ = సముద్రసంబంధమైన, అర్ణోధారా = నీటిధారయొక్క, అంతః = లోపలభాగమందు, అటత్ = తిరుగుచున్న, తిమింగిల = తిమింగిలములను, గిల = తినునట్టి (పెద్దచేఁపలయొక్క), ప్రోద్ధాన = పైకిలేచుటను, నిధ్యాన = చూచుటచేత, లబ్ధ = లభించినట్టి, అధీశ = (తనయొక్క) భర్తయొక్క, ప్రభుతా = ప్రభుత్వములో, స్వభాగ = తనయొక్క భాగమును, హరణార్థ = హరించుటకై, ఆయాయి = వచ్చుచున్నట్టి, నాథా = తనభర్తయొక్క, అనుజ = తమ్ముఁడైన (మన్మథునియొక్క) ప్రాధాన్య = ముఖ్యముచేత, అతివిలోల = విస్తారముగా చలించుచున్న, వాక్ = సరస్వతియొక్క, దృక్ = చూపులును, అబలబ్రహ్మన్ = మత్స్యరూపముతోనున్న ఓ పరమాత్మా; త్వామ్ = నిన్ను, స్తుమః = స్తోత్రముఁజేసెదము. అనుః - అని చెప్పును.

తాత్పర్యము. మత్స్యావతారమూర్తి సముద్రములోని జలమంతయుం ద్రాగి పైకివెడలఁగ్రక్కుటచేత నానీటినుండి పెద్దచేఁపలు పైకిలేచుచుండఁగా, మన్మథుఁడు మీనాంకుఁడగుటచేత, నాచేఁపలఁజూచి, మన్మథుఁడేయని భావించి, యామన్మథుఁడు, తనయన్నగారగు బ్రహ్మదేవుని నావంతు రాజ్యభాగము నాకిమ్మని యడుగవచ్చుచున్నాఁడేమోయని భయముతో సరస్వతి చూచుచున్నది. అట్లు భ్రమింపఁజేయుటకుఁ గారణమైన మత్స్యమూర్తిని స్తుతించెదము అని చెప్పును, అని భావము.

శా. ద్యూత్తుంభద్గిరి కల్పితావని ద్వ్యాపాహినీ సంగమో
హాత్తేందూదయ నిష్పీతప్రాణ జలధిప్రారబ్ధ పుత్రోత్సవో

దాత్త్వోత్థ గజాశ్వాన్యశన కన్యాగోమణీదాన సం
పత్తిప్రీణితదేవ ఘూల్యధిపతి బ్రిహ్మాన్ స్తుమః స్త్వామనుః. ౨౦

టీక. ద్యు=ఆకాశమునకు, ఉత్తుంఘత్=ఎత్తుగాపెరిగియున్న, గిరి=(మంధర) పర్వతముచేత, కల్పిత=చేయబడినట్టి, అవతరణ=దిగడముగలిగిన, ద్యోవాహిని=ఆకాశగంగతోడ, సంగమ=కూడడమువలన, ఉపాత్త=పొందబడినట్టి, ఇందూదయ=చంద్రుడను (పుత్రుడు) పుట్టుటవలన, నిష్పితౄణ=పితృదేవతలయొక్క ఋణము తీర్చబడిన, జలధి=సముద్రముచేత, ప్రారబ్ధ=చేయబడినట్టి, పుత్రోత్సవ=కుమారుడు పుట్టినప్పుడు చేయు ఉత్సవముయొక్క, ఉదాత్తత్వ=అతిశయము చేత, దత్త=పొందబడిన, గజ-ఏనుగులు (ఐరావతమన్నమాట) అశ్వ=గుఱ్ఱములు, (ఉచ్చైశ్రవమన్నమాట) అన్యశన=ఊటిసంబంధమైనయన్నము (అమృతమన్నమాట) కన్యా=కన్యకలు (లక్ష్మీదేవియన్నమాట) గో=ఆవులు (కామధేనువన్నమాట) మణీ=రత్నములు (కౌస్తుభమన్నమాట) మొదలగు, దానసంపత్తి=విస్తారమైన దానములచేత ప్రీణిత-సంతోషపెట్టబడిన, దేవ-దేవతలు కలిగినట్టి, ఘూల్యధిపతిబ్రిహ్మాన్-కూర్మావతారమూర్తియైన యోపరమాత్మా! త్వామ్-నిన్ను, స్తుమః-స్తోత్రము చేసెదము, అనుః-అని చెప్పిరి.

తా॥ దేవదానవులు సముద్రమును చిలుకునట్టి కాలమందు కూర్మావతారమెత్తిన విష్ణుమూర్తివీపునందు మంధరపర్వతమునుంచి మథించిరనియు, ఆ మంధర పర్వతము ఎత్తుగానుండుటచేత నాకాశమునంటినదనియు, నా కొండమీదనుండి యాకాశగంగ దిగిరాగా సముద్రుడు దానితోకూడినయాగా నాగంగా సముద్రులకు జంద్రుడు పుట్టుటచేత సముద్రముయొక్క పితృదేవతల ఋణమంతయు దీరిపోయెననియు, ఆ చంద్రుడు పుట్టినప్పుడు, ఏనుగులు, గుఱ్ఱములు, అమృతము, కామధేనువు, కన్యకలు, రత్నములు మొదలైనవానిని సముద్రుడు దేవతలకు దానము చేసెననియు, వీని కంతకు కారణమైన ఓ కూర్మావతారమూర్తీ నిన్ను స్తోత్రము చేయుచున్నాము అని చెప్పిరని తాత్పర్యము.

శా. అద్యాలోకన భక్తిసంభ్రమదనేహః పూరుషత్యక్త స
త్పానాన్యంభస్తులసీ భ్రమపద ఖురప్రోషాళ నామాత్ర జా
గ్రద్యోగాంబుధి దంష్ట్రికాగ్రపు హ్యనాకలామిషప్రాయశుం
భద్యాథోనిధి సత్కిస్థలికిటి బ్రిహ్మాన్ స్తుమః స్త్వామనుః.

టీక. అద్యాలోకన-మొదట చూడడముచేఁ గలిగిన, భక్తి-భక్తివలన, సంభ్రమవత్-తొట్రుపాటుపడుచున్న, అనేహఃపూరుష-కాలమనే పురుషునిచేత త్యక్త-విడిచిపెట్టఁబడిన, సత్పాద్యాంభః-మంచి పాద్యమును (పాదములు కడుగుట కేర్పాటు చేయఁబడిననీరు పాద్యమనఁబడును) తులసీ-తులసితీర్థమనునట్లుగా, భ్రమప్రద-భ్రాంతిఁగలుగఁ జేయునట్టి, ఖురప్రక్షాళనామాత్ర- డెక్కలు కడుగుట మాత్రమే, జాగ్రద్భోగ- చక్కగా సమర్పఁబడిన, అంబుధి- సముద్రమును, దంష్ట్రికా- కోఱలయొక్క, అగ్ర-చివరనున్న, రిపు-శత్రువైన హిరణ్యాక్షుని యొక్క, హృత్-గుండెకాయ యందలి కాలామిష-నల్లనైన మాంసముతో-ప్రాయ- పోల్చబడిన, శుంభత్ - ప్రకాశించుచున్న, యాదోనిధి సప్తక్ష్మల-ఏడు సముద్రములు భూమియుఁగల, కిటిబ్రహ్మన్-వరాహావతారమైన యోపరమాత్మా! త్వామ్-నిన్ను స్తుమస్-స్తోత్రముచేయుచున్నాము. అనన్-అనిచెప్పన.

తాత్పర్యము. విష్ణుమూర్తివరాహావతారమెత్తి హిరణ్యాక్షుఁడను రాక్షసునిజంపి వానిగుండెకాయయొక్క నల్లని మాంసమును, కోఱలతో బట్టుకొని, సముద్రమునందు నిలిచినప్పుడు, ఆవరాహమూర్తి సముద్రము డెక్కలు మునుగు లోఁతుగలదయ్యెననియు, కాలపురుషుఁడు ఆవరాహమూర్తి కల్పించిన పాద్యమువలె నప్పుడు సముద్రముండెననియు, నల్లనైన గుండెకాయయొక్క మాంసముతో నెత్తఁబడిన భూమి వరాహావతారమూర్తికిఁ గాలపురుషునిచే నీయఁబడిన తులసివలె నుండెననియు నట్టివిలాసముగలవరాహావతారమూర్తిని మేము స్తోత్రముచేయుచున్నాము అనిచెప్పెననియు భావము.

శా॥ డింభద్రోహి వధోత్కటోత్క్రమణదుష్టి క్లిష్టణారోమకూ
పాంభోజ ప్రభవాండభాండ దళనోద్యద్ధ్వాన ధిక్కృత్సభా
స్తంభాంత స్ఫురత్పెళపెళ ధ్వన్యస్తనిశ్చేష్ట ని
ర్దంభోద్యోగదిశావశావ నృహరి బ్రహ్మన్స్తుమస్త్వామనున్. ౮

టీక. డింభ-బాలుఁడైన ప్రహ్లాదునకు. ద్రోహి- అపకారియైన హిరణ్యకశిపుని వధ-చంపుటకై; ఉత్కటోత్క్రమణ- అతిశయముగా నివలకువచ్చుచున్న, దుష్టిక్లిష్టణా-కోపముతోఁగూడిన సంతాపముచేత రోమకూప- (నృసింహ మూర్తియొక్క) రోమములయందు, అంభోజ ప్రభవాండ భాండ - బ్రహ్మాండభాండమంతయు దళన-బ్రద్దలగుట వలన, ఉద్యత్ - అతిశయించుచున్న, ధ్వాన-ధ్వనియనునట్టి ధి-అభిప్రాయము, ధిక్కృత్-కలుగఁజేయుచున్న, సభాస్తంభాంతస్ఫుటన- స్థయు

దలి స్తంభములోనుండి బ్రద్దలగుటవలన గలిగిన, స్ఫురత్-స్ఫురించుచున్న, పెళపెళ ధ్వని- పెళపెళమను ధ్వనిచేత, ఆస్త-కొట్టబడి నిశ్చేష్ట-చేష్టలు మానిన నిర్దంభోద్యోగ-అహంకారము మానిన ప్రయత్నము కల, దిశావశావ-అష్టదిగ్గజములను గలిగినట్టి, నృహరిబ్రహ్మన్ - నృసింహావతారమూర్తియగు నోపరమాత్మా! త్వామ్ - నిన్ను, స్తుమః - స్తోత్రము చేయుచున్నాము, అనుక్ - అనిచెప్పెను.

తాత్పర్యము. ప్రహ్లాదుని బాధపెట్టుచున్న హిరణ్యకశ్యపునందు కోపముతో హుంకరించుచు నాసభాస్థలమునందలి స్తంభములోనుండి నరసింహమూర్తి యుద్భవించునప్పుడు పెళపెళమని ధ్వని కలిగినదనియు. నాధ్వనివలన నష్టదిగ్గజములును చేష్టలుదక్కి, మోడుపడి పోయినవనియును, నట్టి మహాభయంకర మూర్తియగు నృసింహమూర్తిని స్తోత్రము చేయుచున్నాము అని చెప్పెను.

శా॥ స్వతల స్వచ్ఛత రారుణత్వరచితా స్వస్త్రీ పరేడ్భ్రాంతి వా
క్ప్రతికూలత్వ దశాను కారిగళ గాద్గద్య క్షమాంభోజ భూ
నుతిహాసన్నఖర ప్రసారిత పదాబ్జోరుడ్జ గంగాసవా
ప్రతిమాళీశకపర్దకుండలవటుబ్రహ్మన్ స్తుమస్త్వామనుక్.

టీక. స్వతల-తన పాదతలముయొక్క, (అనఁగా నఱకాలియొక్క) స్వచ్ఛతర పరిశుభ్రమైన, అరుణత్వ - ఎఱుపుచేత, రచిత - చేయఁబడిన అస్వస్త్రీ - పరస్త్రీ యందు, పర - ఆసక్తిగలవాఁడైన, ఈట్ - భర్తకలిగిన దానవను, భ్రాంతి - భ్రమగల్గునట్టి, వాక్- వాగ్దేవి (సరస్వతి) యొక్క, ప్రతికూలత్వదశా-అనుకూలము కానిదశను, అనుకారి - అనుకరించుచున్న (పొందుచున్న) గళ - కంఠమునందలి గాద్గదీ-గద్గదస్వరము చేత, అక్షమ-ఓర్పులేనట్టి, అంభోజభూ-బ్రహ్మదేవునియొక్క నుతి - స్తోత్రముచేతనైన, హాసత్ -నవ్వునుబోలిన, నఖర - గోళ్ళుగలవై, ప్రసారిత-చాఁపఁబడిన పదాబ్జోరుట్ - పాదపద్మములయందు, జ - పుట్టినట్టి, గంగ - గంగ యనునట్టి, ఆసవ - మకరందమునకు, అప్రతిమ - అసమానమైన, అలి - తుమ్మెద వలెనున్న, ఈశ - శివునియొక్క, కపర్దకుండల - జటాజూటముగల, వటుబ్రహ్మన్ ఓవామనావతారపరమాత్మా, త్వామ్ - నిన్ను, స్తుమః-స్తోత్రము చేయుచున్నాము అనుక్-అనిచెప్పెను.

తాత్పర్యము:— వామనమూర్తి రెండుపాదములతో నీ ప్రపంచమంతయు నాక్రమించినప్పుడు, వామనమూర్తి పాదముల క్రిందనే శివుడును, బ్రహ్మయును గూడ నుండిరనియు, వామనమూర్తియొక్క స్వచ్ఛమై యెఱ్ఱనియఱకాలునందు, బ్రహ్మ

యు సరస్వతియు నద్దమునందువలె ప్రతిఫలించిరనియు, తెల్లగానుండు తనయొక్క రూపమా యఱకొలునందెఱ్ఱగా నగపడుటచేత తనభర్తయగు బ్రహ్మదేవుడింక నను రక్తుఁడైయున్నాఁడని, వాగ్దేవి భావించి చాపల్యము నొందెనాయనునట్లు వామనమూర్తి స్తుతించు బ్రహ్మయొక్క గద్గదస్వరముతోఁ గూడిన వాక్యములు వినవచ్చు ననియు, వామనమూర్తియొక్క గోళ్ళు తెల్లనివి కాఁబట్టె యవిచాపల్యమునొందిన సరస్వతినిజూచి నవ్వుచుండునట్లుండుననియు శివుఁడు వామనుని పాదములక్రిందనుండి తుమ్మెదవలె నల్లగానున్న తనజటాజూటముతో శ్రీవిష్ణుమూర్తి పాదమునందుండు గంగయొక్క మకరందము నాస్వాదించు తుమ్మెదవలెనుండి యాస్వాదించుచున్నద నియు, నట్టి వామనావతారపరమాత్మను స్తోత్రము చేయుచున్నావని చెప్పెనని భావము

శా. ఆజప్రౌఢిమ దుర్జయార్జునగళోదగ్రాసృగాస్వాదన
వ్యాజాపోశన భాక్స్వ్యద స్వపహృతిప్రాణాహుతి ప్రస్ఫుర
ద్రాజాళీనిఘసావసానవిఘసప్రాయేందు ఖేలాయితా
బ్జాజాధ్యక్షకుఠారధారిభృగురాడ్బ్రహ్మన్ స్తుమస్ త్వామమున్.

టీక. ఆజి - యుద్ధరంగమునందు, ప్రౌఢిమ - నేర్పరితనముచేత, దుర్జయ - జయింపరానివాఁడైన, అర్జున- కార్తవీర్యార్జునునియొక్క, గళ - కంఠమునందలి- ఉదగ్ర - భయంకరమైన, అసృక్ - రక్తమును, ఆస్వాదన - త్రాగుటయనెడు; వ్యాజ - మిషచేతను, ఆపోశనభాక్ - పరిషేచనముఁజేసినవాఁడై, తక్ - ఆకార్తవీర్యార్జునునియొక్క, అసు - ప్రాణములను, అపహృతి - హరించుటయే, ప్రాణాహుతి - కొంచెము కొంచెముగాఁబుచ్చుకొను ప్రాణాహుతులుగలవాఁడై, ప్రస్ఫురత్ - ప్రకాశించుచున్న, రాజాళీనఘస - రాజులసమూహములను జంపుటయేయను నట్టి భోజనముయొక్క, అవసాన - అంతమునందలి విఘసప్రాయ-భుక్తవలెనున్న, ఇందు - (రాజశబ్దముగలిగిన) చంద్రుఁడుకలవాఁడై, ఖేలాయిత - ఎంగిలిచేయఁబడినపాత్రయైన, అబ్జాజాధ్యక్ష - పాలసముద్రముకలవాఁడైన - కుఠారధారి - గండ్రగొడ్డలి ధరించినవాఁడైన, భృగురాడ్బ్రహ్మన్ - ఓపరశురామావతారమూర్తీ త్వామ్ - నిన్ను, స్తుమః - స్తోత్రముచేయుచున్నాము, అమున్ - అనిచెప్పెను,

తాత్పర్యము:—ఈపద్యమునందు పరశురాముఁడు సమస్తరాజులను జంపిన చర్యనంతయు భోజనముచేయుటతోఁబోల్చి వర్ణించినాఁడు ఈభోజనము కార్తవీర్యార్జునుని కంఠమునందలిరక్తముతో నాపోశనముబట్టెను అతని పంచప్రాణములున్ను కొంచెముకొంచెము గాపుచ్చుకొని ప్రాణాహుతులు మ్రింగివైచెను తక్కినయందఱు

రాజులను భోజనముచేసినట్లుగా చంపినైచెను. ఇంక చంద్రునిమాత్రము చంపకుండఁగా విడిచిపెట్టినాఁడు కావున ఇతనికి రాజుఅనుశబ్దముకలదు కావున నితడు భుక్తశేషమునువిడిచినట్లుగా చంపక విడిచినాఁడు సముద్రములను రాకైన పాలసముద్రమును, పెంటిపాత్రగా (భోజనపాత్రగా) విడిచిపెట్టినాఁడు అట్టి చర్యలుగల ఓపరశురామావతారమూర్తి నిన్ను స్తోత్రముచేయుచున్నామని చెప్పెనని భావము.

శా. చాపచ్ఛాత్రనిషంగభంగకుపితత్ర్యక్షభృద్ధనుఃపంచవ
క్త్రీపంచాళికదృఙ్నియోక్తహుతభుగ్గ్రీవాద్వయీపంచక
వ్యాపారభ్రమకారిపంక్తిగళగళ్యాఖండనాఖండదో
ర్దైష్ణ్యప్రదరౌఘరాఘవపరబ్రహ్మన్ స్తుమస్త్వామనున్

టీక:—చాప-ధనస్సునకును, ఛాత్ర-శిష్యునికిని, నిషంగ-అంబులపొదియైన-సముద్రమునకును, భంగ-పరాభవము చేయుటచేత, కుపిత-కోపించిన, త్ర్యక్షభృద్ధనుః-ఈశ్వరునియొక్క, పంచవక్త్రీ-అయిదు ముఖములకు సంబంధించిన, పంచాళిక-అయిదు నుదుర్లలోని, దృక్-నేత్రములనుండి, నియుక్త-నియమింపబడిన, హుతభుక్-అగ్నిహోత్రుని, గ్రీవాద్వయీ పంచక-పదియైన కంఠములనున్న, వ్యాపార-సంహరించుటయను, భ్రమకారి-భ్రమను కలుగఁజేయుచున్న, పంక్తిగళ-రావణునియొక్క, గళ్యా-కంఠములను, ఖండన-నఱుకుటయందు, అఖండదోర్దైష్ణ్య-బీరవోవని భుజపరాక్రమముగల, ప్రదరౌఘ-బాణములుగలిగిన, రాఘవ పరబ్రహ్మన్-ఓ శ్రీరామావతారమూర్తీ! త్వామ్-నిన్ను, స్తుమః-స్తోత్రము చేయుచున్నాము, అనున్-అనిచెప్పెను.

తాత్పర్యము:—శివుని విల్లువిరిచి, ఈశ్వరుని శిష్యుఁడై రావణాసురునిజంపి శివుని కంబులపొదియైన సముద్రమునకడ్డుగట్టి భంగపఱుచుటచేత శివుఁడు కోపించి అతని యైదుముఖములలోని ఫాలనేత్రములయందలి యగ్నిప్రజ్వరిల్లఁగా అగ్నికి రెండుతలలు కావున నా పంచముఖ ఫాలనేత్రముల యగ్నియొక్క తలకాయలు పది యున్న రావణుఁడై రాఁగా వానిని భుజపరాక్రమము చేతనున్న బాణములతీవ్రత చేతను సంహరించిన ఓ రాఘవ రామావతార పరబ్రహ్మమా నిన్ను స్తోత్రముజేసెదము అని చెప్పెనని తాత్పర్యము.

మ. కరిఘూరుద్ధరదగ్ధలాంగలవిభగ్నత్ర్యక్షభరాదక్షుది
క్క్రూరపాదప్రహారస్ఫుటత్స్ఫుటిపభోగవ్యావృతగ్రీవసూ

కరపీఠీకృత, పృష్ఠతాసహిత మహాగాఢాధి కూర్మాధిరా
ట్పరిక్లప్తప్రళయాంబుగాహన హరిబ్రహ్మన్ స్తుమస్ త్వామనుస్

టీక:—కరిపూః - హస్తినాపురమును, ఉద్ధరణ-ఎత్తుటచేత, ఇద్ధ-పవిత్రమయిన, లాంగల - నాఁగలివలన, విభగ్న క్ష్మా-భూమియొక్క, భర - బరువువలన అదక్ష - మోయలేనట్టి, దిక్కరి - దిగ్గజములయొక్క, పాద - పాదముల చేత ప్రహత్ - కొట్టబడి, స్ఫుటత్ - విడిపోవుచున్న, ఫణిప - ఆదిశేషునియొక్క, భోగ - పడగయందు, వ్యావృత- వ్యాపారముగల, గ్రీవ - కంఠముగల, సూకర - ఆదివరాహమునకు, పీఠీకృత-పీఠముగాఁ జేయబడిన, పృష్ఠతా - పృష్ఠభాగము కలిగినదగుటచేత, ఆహిత - సంపాదింపఁబడిన, మహాగాఢ - మిక్కిలి యధికమైన, ఆధి - బాధగల కూర్మాధిరాట్ - ఆది కూర్మముచేత, పరిక్లప్త - చేయబడిన - ప్రళయాంబు గాహన-ప్రళయకాలోదకమునందు మునుఁగుటలుగల, హరిబ్రహ్మన్ - బలరామావతారపరమాత్మా! త్వామ్ - నిన్ను స్తుమః-స్తోత్రము చేయుచున్నాము, అనుః-అని చెప్పెను.

తాత్పర్యము:—బలరామమూర్తి తన నాగలిచే హస్తినాపురమును పైకెత్తుట వలన భూమి బ్రద్దలయి, బరువు హెచ్చఁగా, దిగ్గజములు మోయలేకపోయెను. దిగ్గజములయొక్క పాదములతొక్కుఁడుచేత, నాదిశేషుఁడు సాగిపోయెను. ఆ బరువుచేత ఆదివరాహముయొక్క మెడ నలిగిపోయెను, అప్పుడది ప్రళయోదకమునందు మునిఁగెను. అట్టి గొప్పకార్యములు జరుగుటకు కారణమైన ఓ బలరామమూర్తీ నిన్ను స్తోత్రము చేయుచున్నామని చెప్పెను అని తాత్పర్యము

మ॥ అతిదోః పీడన కర్కటీఫలిత కంఠాభత్వ దుర్ధర్త్వభూ
ర్తతృణావర్త దృఢాంగ పాతహిత గోత్రాభర్తృ గోత్పాదిత
క్రతుభుగ్గ్రీష్మ హతాగ్రి హోన్మఖ శతార ధ్వస్తమైనాక ని
ష్కృతన భ్రాంతిగ నందగోపక సుతబ్రహ్మన్ స్తుమస్ త్వామనుస్

టీక. అతి-విస్తారముగా, దోః-బాహువులయొక్క, పీడన-మర్దనమువల కర్కటీఫలత-దోసపండువలె చేయఁబడిన, కంఠాత్వ-మెడయొక్క కాంతిగలిగిన, ధూర్త - దుర్మార్గుడైన, తృణావర్త - తృణావర్తుఁడను రాక్షసునియొక్క, దృఢాంగ - దిట్టమైన శరీరము, పాత - పడుటచేత, హిత - అనుకరింపబడిన, గోత్ర-పర్వతములయొక్క, భీతిత - భయపెట్టఁబడిన కారణముచేత, ఉత్పాదిత -

నలిగినట్లు, కౌస్తుభగ్రాహిన్ - దేవేంద్రునియొక్క, గ్రహణ - పట్టుకొనుటకై, ఆగ్రహ - కోపముచేత, ఉన్ముఖ - ఎదురుముఖము గావింపఁబడిన, శతార - వజ్రాయుధమును, ధ్వస్త - కొట్టఁబడిన, మైనాక - మైనాకపర్వతముయొక్క, నిష్పతన - పడుటయనునట్టి, భ్రాంతి - భ్రమను, గ - పొందుచున్నట్టి, నందగోపకసుతబ్రహ్మన్ - నందుని కుమారుఁడైన గోపాలకృష్ణావతార పరబ్రహ్మమూర్తీ! త్వామ్ - నిన్ను స్తుమః - స్తోత్రము చేయుచున్నాము అనుచు - అని చెప్పెను.

తాత్పర్యము. శ్రీకృష్ణమూర్తీ తృణావర్తుఁడను రాక్షసుని జంపినప్పుడు నాఁడు కిందపడుట యింద్రునితో యుద్ధమునకై పైకెగిరి యాతని వజ్రాయుధము యొక్క దెబ్బచేత నేలపైబడిపోయిన మైనాకపర్వతమువలె నున్నాడనియు, అట్టియుద్ధము చేయ నేర్పుగలిగినట్టి నందునికుమారుఁడైనట్టి గోపాలకృష్ణమూర్తీ! నిన్ను స్తోత్రము చేయుచున్నామని చెప్పెనని తాత్పర్యము.

మ॥ స్వమహాబాహుకృపాణ కృత్తగళ తుచ్ఛమ్లేచ్ఛ వీరస్ఫుటో
త్క్రమణాపాదిత పద్మినీరమణ మధ్యచ్ఛిద్రఖశ్యామికా
గమనానాన మహోపరాగ ముదితక్ష్మా సార గంగానదీ
భ్రమకృత్కీర్తిక కల్కిమూర్తిక పరబ్రహ్మన్ స్తుమస్త్వామనున్

టీక. స్వ - తనయొక్క, మహాబాహు - గొప్ప చేతులయందలి, కృపాణ - ఖడ్గముచేత, కృత్తగళ - ఛేదింపఁబడిన, కంఠములుగల, తుచ్ఛ - నీచులైన, మ్లేచ్ఛవీర - మ్లేచ్ఛ వీరులయొక్క, స్ఫుట - స్పష్టమైన - ఉత్క్రమణ, - ప్రాణము వెడలి పోవుటచేత, ఆపాదిత - అవమానము చేయఁబడుచున్న, పద్మినీరమణ - సూర్యుని యొక్క, మధ్య - నడుమనున్న, ఛిద్ర - రంధ్రమునుండి కనిపించునట్టి, ఖ - ఆకాశముయొక్క, శ్యామికా - నల్లపురంగువలన - ఆగమ - వచ్చునట్టి, నానా సమయ - అనేక సమయములయందు, అపరాగ - గ్రహములచేత, ముదిత - సంతోషించుచున్న, క్ష్మా - భూమికి, సారగంగానదీ భ్రమకృత్ - ఆకాశగంగ యను భ్రమను గలిగించుచు, కీర్తిక - తెల్లనికీర్తికల, కల్కిమూర్తికి పరబ్రహ్మన్ - ఓకల్కి రూపావతారమైన పరమాత్మా! త్వామ్ - నిన్ను, స్తుమన్ - స్తోత్రముఁ జేసెదము అనున్ - అని చెప్పెను.

తాత్పర్యము. కల్కిమూర్తీ మ్లేచ్ఛవీరులయొక్క కంఠములు నరుకుటచేత, వారియొక్క జీవములు, వీరస్వర్గమునంపుటకై సూర్యమండలమును ఛేదించుకొని,

ధ్రముఁజేసిపోయెననియు, నిరంధ్రమునుజూచి, సూర్యగ్రహణమనియు దానికి గారణమై యచ్చటనుండి స్ఫురించుచున్న కల్కిమూర్తియొక్క కీర్తి తెల్లని యాకాశమునుండి గ్రహణవేళలయందు జనులను స్నానముజేయించుటకై వచ్చుచున్న యాకాశగంగవలెనున్నదనియు, భ్రమను జెందింపఁజేయుచున్న యో కల్క్యవతార పరబ్రహ్మమూర్తీ నిన్ను స్తోత్రము చేయుచున్నానని చెప్పెనని తాత్పర్యము.

సంపూర్ణము.



ఆల్బర్టు పవర్ ప్రింటింగువర్క్సు యందు ముద్రింపబడియె కాకినాడ.

THE

# ANDHRA INDUSTRIAL & TRADING Co.,

*Suryarowpet, Cocanada.*

*Suppliers of*

Kerosine Oil & Crude Oil, Engines, Steam Engnies, Tractars, Rice & Flour Milling Machinery, Irrigation pumps, Textile Machinery, Cinematograph apparatus' Electric Dynamos, Motars, Meters, Electrical apparatus & accessories, Electric Tolos, etc. etc.

**Prices defy Competition !!**

**Enquiries solicited !!!**

**ExPert advise available.**

---

ది

# ఆంధ్ర యిన్‌డస్ట్రియల్ & ట్రేడింగు కంపెనీ.

కాకినాడ.

అన్నిరకముల కిరసనాయిలు, క్రూడుఆయిలు, యింజనులు, స్టీముయింజనులు, ట్రాక్టర్లు, రయిసుమిల్లులు, పిండిమిషనులు, నీరుతోడుపంపులు, బట్టలునేయు మిల్లులకు పనికివచ్చు సామానులు, మిషనులు, సినిమా సంబంధమగు అన్నిరకముల మిషనులు వాటిసామానులు, ఎలక్ట్రిక్ డైనమోలు, మోటారులు, యితరవిధములగు అన్నిరకముల ఎలక్ట్రిక్ సామానులూ, మొదలగునవన్నియూ బహు సరసమైన ధరలకు దొరకును.

కావలసిన సామానులు తెలిపినవెంటనే పూర్తియైన సమాచారమునూ ఖరీదులును తెలుపబడును.

యితర ధరలకన్న, మాధరలు బహు తక్కువ.

ఒకసారి చూచిన మీకే తెలియగలదు.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA110B170 |
| పుస్తకం పేరు | తెనాలి రామకృష్ణకవి చరిత్రము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 127 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Haseema |
| పేజీలు విడదీసినది | Haseema |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |